

శ్రీ వేమూరి ఆంజనేయశర్మ సభ నిధిపాలక మండలి
అధ్యక్షులుగా ఏకగ్రీవంగా ఎన్నికైనారు

# కార్యదర్శి నివేదిక

నూతనంగా ఎన్నుకొనబడిన దక్షిణ భారత హిందీ ప్రచార సభ ఆంధ్ర హైద్రాబాదు నిధిపాలకమండలి మొదటి సమావేశం ది. 22-6-1991 న శ్రీ బోయపాటి నాగేశ్వరరావు గారి అధ్యక్షతన ఆంధ్ర సభలో జరిగింది. ఆంధ్ర సభ ఆస్తులు భవనాలను గురించి కార్యదర్శి ఇచ్చిన నివేదికకు సంక్షిప్త రూపమిది.

ఇప్పటి దక్షిణ భారత హిందీ ప్రచారసభ పూర్వం ఆంధ్ర రాష్ట్ర హిందీ ప్రచార సంఘమని పిలువబడుతూ వుండేది. కలవారు హిందీ ప్రచారాన్ని పవిత్ర కార్యక్రమంగా భావించి త్యాగ భావంతో దానధర్మములు చేసే రోజులవి. ఆంధ్ర రాష్ట్ర హిందీ ప్రచార సంఘమునకు శ్రీదేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులుగారు అధ్యక్షులుగా వుండేవారు సంఘ ఆస్తులను కొనుగోలు చేయుటలోను సంపదను అభివృద్ధిచేయుటలోను శ్రీ ఉన్నవ రాజగోపాలకృష్ణయ్య, శ్రీ వేమూరి ఆంజనేయ శర్మ వంటివారు గలరు శ్రీ ఉన్నవ రాజ గోపాలకృష్ణయ్య, శ్రీ వేమూరి ఆంజనేయశర్మ గార్లు హిందీ ప్రచారానికి నాటక ప్రదర్శనను సాధనంగా నిర్ణయించి స్వరాష్ట్రంలోనూ, యితర రాష్ట్రాల లోనూ అనేక నాటక ప్రదర్శనలిచ్చి నిధులను సేకరించి తద్వారా సంఘానికి అనేక స్థలాలను, భవనాలను కొనివున్నారు. అప్పటిలో వారేర్పరచిన స్థలాలు, భవనాలే ఈనాటి సభ అమూల్యా సంపదలుగా వర్ధిల్లు తున్నవి. అందులకు ఆంజనేయశర్మగారికి సభ ఋణపడి యున్నది

ప్రముఖ వ్యాపారకేంద్రమైన విజయవాడ నడిబొడ్డులో ఏలూరు రోడ్డునందు 413 చదరపు గజాల స్థలాన్ని భవనంతో సహా కొనియుండిరి ఆ భవనానికి తదుపరి 2 అంతస్తులువేసి దానశీలి దేశోద్ధారక నాగేశ్వరరాయ భవనమను నామకరణం చేసిరి. విజయవాడ శాఖ కార్యాలయ కార్యకలాపాలు యీభవనంలోనే జరుగుచున్నవి. 1944 వ సం॥లో దఫదఫాలుగా విజయవాడ మాచవరం నందు 2936 చ. గ. ల స్థలాన్ని కొనియుండిరి. తదుపరి అచట అనేక పక్కా-భవనంలను కట్టించిరి ప్రస్తుతం యిచట హిందీ డిగ్రీ కాలేజి బి యేడ్ కాలేజి నడచుచున్నవి.

విశాలాంధ్ర ఏర్పడగానే ఆంధ్ర రాష్ట్ర హిందీ ప్రచార సంఘమును హైద్రాబాదు హిందీ ప్రచార సంఘమును విలీనం చేసి దక్షిణ భారత హిందీ ప్రచారసభ ఆంధ్రశాఖగా రూపొందించిరి. 1951వ సం॥ నుండి శ్రీ వేమూరి ఆంజనేయశర్మ గారు హైదరాబాదు హిందీ ప్రచార సభ

ఫోన్: 36866

టెలిగ్రామ్: హిందీసంఘ్

# 449

# స్రవం

## సాహిత్య మాసపత్రిక

ఆగస్టు 1991

సంపాదకులు

శ్రీ వేమూరి ఆంజనేయ శర్మ

శ్రీ ఈమని దయానంద

శ్రీ పిన్నమనేని ప్రసాదరావు

**దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర**

ఖైరతాబాద్-హైదరాబాద్-500 004

సంవత్సర చందా
20.00 రూ॥

విడిప్రతి
2.00 రూ॥

# ఈ సంచికలో



సంపాదకీయం

# మన ప్రధాని

శ్రీ పాములపర్తి వెంకట నరసింహారావు గారు భారత ప్రధానిగా ఎన్నికైనారు. స్వాతంత్ర్యం లభించిన తరువాత దక్షిణదేశానికి ఈ పదవి లభించడం ఎంతో ఆనందదాయకం. భారత ప్రధాని పదవికి భాషావిభేదాలూ, ప్రాంతీయ వ్యత్యాసాలూ లేకపోయినా దాదాపు నలభై నలభైఐదు సంవత్సరాలు ఉత్తరదేశంవారే ప్రధాన మంత్రులుగా వుంటూ వచ్చారు. ఒక్క మురార్జీ దేశాయి మాత్రం గుజరాతీ వారు. ఇంతకాలం తరువాత దక్షిణ దేశానికి- అందులో ఆంధ్రులకు ఈ అవకాశం లభించడం ఆంధ్రులకు ఎంతో గర్వకారణం. శ్రీ నరసింహారావు గారు తెలుగులోనే గాక హిందీ, మరాఠీ, ఇంగ్లీషువంటి పలుభాషల్లో విద్వాంసులు. తెలంగాణంవారు గాన ఉర్దూతెలిసిన వారని వేరే చెప్పవలసిన అవసరమే లేదు. ఎవరు ఏమి చెప్పినా, తల్లిభాష యెడల అభిమాన ముండడం, తాను జన్మించిన ప్రాంతమంటే ఆదరం, గౌరవం ఉండడం సహజం. శ్రీనరసింహారావు గారు భారతప్రధాని అయిన తరువాత హైదరాబాదు వచ్చిన సందర్భంలో తెలుగు విశ్వవిద్యాలయం స్నాతకోపన్యాసం చేస్తూ "ఢిల్లీకి రాజైనా తల్లికి కొడుకే, నేను తల్లి ఒడిలోకి వచ్చా"నంటూ గద్గద స్వరంతో అన్నారు. రెండు నిమిషాలు భావావేశంలో వారు మాట్లాడలేక పోయినారు. తల్లిభాష అన్నా, తాను జన్మించిన ప్రాంతమన్నా వారికి ఎంత అభిమానమున్నదో వారిమాటలు స్పష్టం చేస్తున్నవి. వారు ఆ మాటలన్నప్పుడు ఆ సమావేశంలో పాల్గొన్నవారి కళ్ళు చెమ్మగిల్లినవి. తల్లి అభిమానం, తల్లి భాష అభిమానం అటువంటిది. తెలుగు విశ్వవిద్యాలయంలో వారు తెలుగులో స్నాతకోపన్యాసం చేశారు. విశ్వవిద్యాలయాలలో స్నాతకోపన్యాసాలన్నీ ఇంగ్లీషులోనే జరుగుతూ వుండడం మన మెరుగుదుము. భారతప్రధానిగా హిందీలో ప్రమాణస్వీకారం చేయడం, వారవడికి భిన్నంగా తెలుగు విశ్వవిద్యాలయ స్నాతకోత్సవంలో తెలుగులో స్నాతకోపన్యాసం చేయడం శ్రీ నరసింహారావు గారి భారతీయ భాషాభిమానాన్ని వ్యక్తం చేస్తున్నవి. ఈ సందర్భంలో ఆంధ్రు లందరి తరపునా, భారతీయ భాషాభిమానులందరి తరపునా శ్రీ నరసింహారావు గారికి హృదయ పూర్వకమైన అభినందనలు స్రవంతి తెలియజేస్తున్నది.

ఇదే సందర్భంలో ఇంకొక విషయం ఉల్లేఖించవలసి వున్నది. భారతదేశ భాషల వికాసానికీ, అభివృద్ధికి జ్ఞానపీఠ్ బహుమతి ఎంతగానో ఉపకరిస్తున్నది. ఆ బహుమతి బెంగాలీ,

కన్నడం, హిందీ వంటి భాషలవారికి రెండు మూడు సార్లుగా లభించింది. డాక్టర్ కరణ్ సింగ్‌గారు జ్ఞానపీఠ సమితికి అధ్యక్షులుగా ఉన్నప్పుడు శ్రీ విశ్వనాథవారి వేయిపడగలు బహుమతికి పంప బడింది. ఆ సందర్భంలోనే శ్రీ నరసింహారావు గారు ఆ నవలను హిందీలోనికి అనువదించారు. కొన్ని కారణాలవలన విశ్వనాథ వారికి ఆ సంవత్సరం బహుమతి లభించలేదు. అంటే ఆంధ్రులకు ఆ బహుమతి లభించలేదు. తరువాత డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి గారు జ్ఞానపీఠ్ అధ్యక్షులైనారు. విశ్వనాథవారి రామాయణ కల్పవృక్షం రెండోసారి పోటీకి పంపబడింది. పెద్దపోటీ ఏర్పడింది. సుప్రసిద్ధ మరాఠీ నవల యయాతికీ విశ్వనాథవారి రామాయణానికీ పోటీ వచ్చింది. ఆ సంవత్సరం గూడా విశ్వనాథ వారికి బహుమతి రాకపోతే ఇక ఆంధ్రులకు బహుమతి రాదేమోననే సందేహం మావంటి వారికి కలిగింది. అదే విషయాన్ని శ్రీ గోపాలరెడ్డి గారికి తెలియజేయడం గూడా జరిగింది. ఆపోటీలో శ్రీగోపాలరెడ్డిగారి నిర్ణాయకమైన అభిమతం వలన విశ్వనాథవారికి ఆబహుమతి లభించింది. అంతకు పూర్వం జరిగిన విశ్వనాథవారి ఉత్తరప్రదేశ్ పర్యటన గూడా అందుకు బాగా ఉపయో గించింది. మహాకవి శ్రీ రామధారీ సింహ్ దినకర్ వంటివారు గూడా విశ్వనాథవారి ప్రతిభాపాట వానికి ముగ్ధులైనారు ఉత్తరప్రదేశ్ పర్యటనలో శ్రీ దినకర్‌గారు గూడా విశ్వనాథవారివెంట ఉన్నారు. ఢిల్లీలో రాష్ట్రపతి భవనంలో బహుమతి నిర్ణయం జరిగిన నాటి సాయంత్రం శ్రీ గోపాలరెడ్డిగారు ఎంతో బరువు తీరినట్లు కన్పించారు. ఆంధ్రులకు జ్ఞానపీఠ్ బహుమతి లభించినందుకు ఆంధ్ర ప్రజానీకంతోబాటు వారు గూడా సంతోషించారు. అది మొదటి బహుమతి విషయం. ప్రస్తుతం శ్రీ నరసింహారావు గారు జ్ఞానపీఠం అధ్యక్షులు. వీరి సమయంలో సుప్రసిద్ధ యువకవులు డా॥ సి. నారాయణరెడ్డి గారికి జ్ఞానపీఠ బహుమతి లభించింది. ఇది దైవికంగా జరిగినా ఇద్దరు తెలుగువారు అధ్యక్షులుగా వుండడం, ఆ సమయంలో ఇద్దరు తెలుగు కవులకు జ్ఞానపీఠం బహుమతి లభించడం ముదావహం.

శ్రీ నరసింహారావు గారు మన దేశం ఆర్థిక సంక్షోభంలో చిక్కుకొని వున్న కష్ట సమయంలో ప్రధానమంత్రి అయినారు. శ్రీ రాజీవ్‌గాంధి గారివలెనే శ్రీ నరసింహారావు గారు మృదుస్వభావులు అందరినీ కలుపుకొనిపోయే వ్యక్తి. దేశసంక్షోభాన్ని వజ్ర సంకల్పంతో ఎదుర్కొంటున్నారు. ఎటుచూచినా స్వార్థం తాండవిస్తున్న రోజులివి. పార్టీల పేరుతో వబ్బం గడుపు కొంటున్న వాతావరణం. ఏ పార్టీలో చూచినా ఇదేస్థితి ఏర్పడివున్నది. కల్లబొల్లి కన్నీళ్ళకు మాత్రం కొదువలేదు....స్వార్థం తప్ప రెండో దృష్టిలేదు. ఈ స్థితిలో గూడా శ్రీ నరసింహారావు గారు అకుంఠిత దీక్షతో దేశాన్ని గమ్యానికి చేర్చగలరని విశ్వసిస్తున్నాము. వారికి స్రవంతి పక్షాన విజయాన్ని కాంక్షిస్తూ అభినందనలు తెలియజేస్తున్నాము.

# చరిత్ర ప్రతిష్ఠించిన ప్రధాని శ్రీ 'పి. వి.'

శ్రీ వి. పి. రాఘవాచార్యులు

శ్రీ పి. వి. నరసింహారావు భారత ప్రధాని అయ్యారు. ఎనభై నాలుగు కోట్ల ప్రజలు గల ఈ ఉపఖండాన్ని పాలించే ప్రభుత్వానికి అధినేత అయ్యారు. ఇది ఆయన కోరుకుంటే వచ్చిన పదవి కాదు. ప్రయత్న పూర్వకంగా వచ్చింది అంత కంటే కాదు. ఆ పదవే ఆయన్ని వరించింది. రాజీవ్‌గాంధీ దారుణ హత్యానంతరం స్వతంత్ర భారత రాజకీయ చరిత్రలో అతి క్లిష్టమైన ఘట్టంలో దేశ చరిత్రయే ఆయన్ని ఈ పదవిపై ప్రతిష్ఠింప చేసింది. కనుక పార్లమెంటు సభ్యుడు కాని, తగినంత సంఖ్యా బలంలేని పార్టీ నాయకుడుగా ఆయన ప్రధాని కావటం ఒక అపూర్వమైన చారిత్రక సంఘటన.

శ్రీ పి వి. ప్రతిభాశాలి అనే విషయంలో సందేహం లేదు కదా! ఆయన బహుభాషాభినివేశం కూడా సర్వ విదితమే. అయితే వీటన్నిటి కన్న ఆయన మానసిక సంస్కారం చాలా గొప్పది. భావాలలో స్పష్టత! ఆ భావాలను అభివ్యక్తీకరించడంలో అంతే స్పష్టత — ఆయన విశిష్టలక్షణాలు. సునిశితమైన మేధాశక్తి ఉండటం వల్ల ఏ విషయాన్నైనా అట్టే అవగాహన చేసుకునే సామర్థ్యం ఆయన కున్నది. సంస్కారవంతుడు కావటం వల్ల ఎదుటి వానిని సులభంగా ఆకట్టుకోగలవాడు. స్నేహశీలి, సౌజన్యశాలి, ఆలోచనలో గాని, మాటలోగాని కర్కశత్వం ఆయనలో కనుపడదు. అనవసరమైన వివాదాలలో తల దూర్చే అలవాటు లేదు. తాను నమ్మిన దాన్ని హేతువాదంతో ఒప్పించి, మెప్పించగల నేర్పు ఉన్నది. చదువు కున్న చదువు వంట బట్టితే అదే నైతికత అని ఎవరో అన్నమాట నాకు జ్ఞాపకం. ఈ మాటకు శ్రీ పి.వి. ఉదాహరణం.

నా విద్యార్థి దశలో - సంవత్సరం జ్ఞాపకం లేదు — రెడ్డి హాస్టలు (హైదరాబాదు) లో ఎదో ఒక సభ జరిగింది. నేనా సభకు వెళ్ళాను. శ్రీ బూర్గుల రామకృష్ణారావు ఆ సభలో వేదికపై ఉన్నట్లు కూడా జ్ఞాపకం. వేదికపైకి ఒక యువకుని ఆహ్వానించారు. ఆయన వయస్సు ఇంచుమించు నా వయస్సే. తెల్లని ఖద్దరు పాయిజామా ఖద్దరు లాల్చీ ధరించిన ఆ యువకుడు వేదికనెక్కి దేవుని ఉపాలంభనము(Impeachment of God) అనేశీర్షికతో పద్యాలు చదివాడు. సభకు హాజరయిన యువజనమంతా ఆ పద్యాలు విని హర్షధ్వానాలు చేశారు. వారిలో నేనూ ఉన్నాను. ఆ పద్యాలు ఆ తరువాత ఎప్పుడు నా దృష్టికి రాలేదు. ఆ యువకుడే పి.వి. నరసింహారావు. నేనాయనను చూడటం అదే మొదటిసారి. (వయస్సులో పి.వి. నా కంటే పది మాసాలు చిన్న). ఆ తరువాత 1958లో ఆయన

శాసన సభ్యుడుగా ఉన్నప్పుడు నేనాయనను కలుసుకున్నాను.

మాజీ హైదరాబాదు రాష్ట్రంలో నిజాం నిరంకుశ పాలనకు ప్రతిఘటనగా రాష్ట్ర కాంగ్రెస్ పార్టీ ఉద్యమించింది. కొన్నాళ్ళ తర్వాత ఆ పార్టీలో రెండు వర్గాలు ఏర్పడ్డాయి. 'దేశాయి కాంగ్రెస్' అని, 'గోసాయి కాంగ్రెస్' అని వాటికి ప్రతీతి. జనార్దనరావు దేశాయి అనే నాయకుని ఆధ్వర్యంలో ఉండిన వర్గం దేశాయి కాంగ్రెస్. స్వామి రామానందతీర్థ అనే సన్యాసి నాయకత్వంలోనిది గోసాయి కాంగ్రెస్. యువకులు చాలా మట్టుకు స్వామి రామానందతీర్థకు అనుచరులు. వీరందరు అభ్యుదయ భావాలు కలవారని పేరు తెచ్చుకున్నవారు. శ్రీ పి.వి. ఈ అనుచర వర్గంలో చేరినవాడే. అందే ఆనాటినుండి రాజకీయంగా కాంగ్రెస్ పార్టీలో చేరి, అభ్యుదయ వాదాన్ని అనుసరించిన వాడన్నమాట. గడచిన అర్థ శతాబ్ద కాలంలో అటుఇటు ప్రక్కదారులబోక ఏకపథగామియై రాజకీయ జీవితాన్ని గడిపిన ధీశాలి ఆయన. తాను నమ్మిన పార్టీ పట్ల ఆయన అచంచల విశ్వాసం, సిద్ధాంతపరంగా అభ్యుదయ భావ వైశద్యం ఆయన నేడు ఈ ఉన్నత పదవిని పొందడానికి కారణభూతములైనాయి.

నేను పైన పేర్కొన్న రెడ్డి హాస్టలు సభలో ప్రేక్షకునిగా మొదటిసారి చూచిన శ్రీ పి. వి. తో 1958 లో శాసనసభ్యుడుగా ఉన్నప్పుడు ప్రత్యక్ష పరిచయం కలిగింది. రాష్ట్ర పునర్విభజన అనంతరం తెలంగాణాలో ఉన్న మాజీ హైదరాబాదు ప్రభుత్వ ఉద్యోగుల జీతభత్యాలు, ఉద్యోగరక్షణ మొదలైన సమస్యలెన్నో ఉత్పన్నమయ్యాయి. అప్పట్లో ప్రభుత్వ పాఠశాలలే తెలంగాణాలో అధికంగా ఉండినవి. వాటిలో పనిచేసే ప్రభుత్వ ఉద్యోగులైన ఉపాధ్యాయులను కూడా ఈ సమస్యలు కలవరపెట్టినవి. ఆ పరిస్థితుల్లో నేను ఉపాధ్యాయ సంఘానికి అధ్యక్షుడనైనాను. ఉపాధ్యాయుల సమస్యలన్నింటిని పదమూడు శీర్షికలుగా విభజించి "పదమూడు కోర్కెల పోరాటం"ను సంఘం పక్షాన ప్రారంభించాము. ఇది 1957 చివరి కాలం.

రాష్ట్ర పునర్విభజన చట్టాన్ని అనుసరించి తెలంగాణాప్రాంతమునుండి ఎన్నుకోబడ్డశాసనసభ్యులందరు గల 'ప్రాంతీయసంఘం' ఒకటి ఏర్పడింది. ఆ ప్రాంతీయ సంఘంలో ఇతర ఉపసంఘాలతో పాటు విద్యావిషయక ఉపసంఘం కూడా ఉండేది. ఆ ఉపసంఘానికి శ్రీ పి. వి. అధ్యక్షులు. కేంద్ర ప్రభుత్వానికి రాష్ట్ర ప్రభుత్వానికి మేము సమర్పించిన విజ్ఞప్తులు, 13 కోర్కెల పట్టిక పట్టుకొని, నేనూ, నా సహచరులూ శ్రీ పి. వి. ని కలుసుకున్నాము. ఆయన ఎంతో శ్రద్ధతో, ఓపికతో మా వాదనవిన్నారు. i, 2 సమస్యల ఔచిత్యం విషయంలో మాతో విభేదించారు. మాకూ బలమైన వాదనలేకుండినది. తర్వాత కొద్దిరోజులలోనే ఆయన మా కోర్కెలపై ఆంగ్లంలో ఒక నివేదిక సిద్ధంచేసి ప్రాంతీయ సంఘానికి సమర్పించారు. పి వి. రచనా పాటవం, హేతువాదం మొదటిసారి ఆ నివేదికలో చూసాను. ఆ తర్వాత ఎన్నో రచనలు నివేదికలు చూచాను. ఆంగ్లంలో ఆయనతో సమానంగా రచన చేసేవారు చాలా అరుదు. పదాలు పదబంధాలు సహజంగా వాక్యాలలో వచ్చిపడి ఒదిగిపోతాయి. అవి అప్రయత్నంగా పడతాయి. వాటిని మార్చి మరోవిధంగా వ్రాయడం కష్టసాధ్యం. ఆ రచన ప్రౌఢంకాదు. పెద్దపెద్ద పదాలు కృత్రిమంగా తెచ్చిపెట్టడు. ఆయన శైలికి సారళ్యము ఔచిత్యం ముఖ్యలక్షణాలు.

ఆంధ్రప్రదేశ్‌లో తెలుగు అధికారభాషగా చేస్తూ నిర్మించిన చట్టానికి ఆయనేకర్త. ఆ చట్టానికి పూర్వం 'శ్వేతపత్రం' (White Paper) ఒకటి

సిద్ధం చేసి ఉభయ శాసనసభలకు సమర్పించారు. 1968 ప్రాంతంలో అని జ్ఞాపకం. అదొక విశిష్టమైన పత్రం. దానిలోని మొదటి వాక్యం నాకిప్పటికీ జ్ఞాపకమున్నది. 'The essence of democracy lies in the fullest participation of the people in the governance of the country' అనేదే ఆ వాక్యం. ప్రజల భాగ్యంలో ప్రభుత్వ వ్యవహారాలు జరగటం ప్రజాస్వామ్యానికి మూలమనే సిద్ధాంత పరమైన వాదనను చాలా ప్రభావంతంగా నిర్మాణం చేశారు, ఆ శ్వేత పత్రంలో. దాని తెలుగు అనువాదం కూడా శాసన సభలకు అందజేశారు.

విద్యా మంత్రిగా ఆంధ్రప్రదేశ్‌లో ఆయన లక్ష్యశుద్ధితో చేసిన కార్యక్రమాలు చాలా ఉన్నవి. 'రెసిడెన్షియల్' పాఠశాలల స్థాపన, జూనియర్ కళాశాలల పథకం, ప్రాంతీయ భాషా మాధ్యమంలో బోధన, తెలుగు అకాడమీ స్వరూప స్వభావాల నిర్దేశం లాంటి కొన్నింటిని ఉదాహరణగా పేర్కొవచ్చు. రాష్ట్ర ముఖ్యమంత్రిగా ఉన్నత విద్యా శాఖను తానే నిర్వహించడం విద్యాభివృద్ధి యందు ఆయనకు గల శ్రద్ధాసక్తులకు తార్కాణం.

విధాన పరిషత్తులో నేనుండిన 18 సంవత్సరాలలో 14 సంవత్సరాలు మంత్రిగా, ముఖ్యమంత్రిగా, ఆయనతో నాకు భేటీ జరిగింది. నేనెప్పుడూ ప్రతిపక్షంలో ఉన్నవాడినే. సభావేదికపై మేము పరస్పరం భేదించిన సంఘటనలుండినవి. కాని వైయక్తికంగా మా సంబంధాలు సౌహార్ద్రభావ పూరితములు. ఆయన నన్ను ఎంతో ఆదరించారు. గౌరవించారు కూడా. ముఖ్యమంత్రిగా ఉన్న రోజులలో ఆయనతో ఇంటర్వ్యూ దొరుకడం ఒకసారి ఆలస్యమైంది. తర్వాత కలిసినప్పుడు నేను ఫిర్యాదు చేశాను. ఆయన అంతరంగిక సిబ్బందిపై. అవుననీ, కాదనీ—ఏ సమాధానం చెప్పక పోవడాన్ని విమర్శించాను. 'రాఘవాచారి గారికి కాదని ఎవరైనా చెప్పగలరా'? అని అంటూ సమయాభావం వల్లనే తప్ప వేరు కారణం కాదని తమ సిబ్బందిని సమర్థించారు. తన శాఖ అధికారులను ఎప్పుడూ ఆయన కించపరచడు. అందుకే ఆయన వద్ద పని చేసిన అధికారులకు ఆయనంటే వల్లమాలిన గౌరవం అభిమానం.

రాష్ట్ర ముఖ్యమంత్రిగా ఆయన పదవీ కాలం - రెండు సంవత్సరాలు-శాంతియుతంగా జరుగలేదు. అన్ని ప్రాంతాల ప్రజల సద్భావంతో ఆ పదవి చేబట్టినా రాజకీయ దుష్టశక్తులను ఆయన తట్టుకోలేకపోయారు. తెలుగుజాతి సమైక్యమునకే నిరంతరం కృషిచేసిన శ్రీ పి.వి.కి, బ్రహ్మాండమైన ప్రత్యేక తెలంగాణా ఉద్యమంలో రాష్ట్ర సమైక్యానికి అచంచలంగా నిలచిన పి.వి.కి ప్రత్యేకాంధ్ర రాష్ట్ర ఆందోళన ఎదుర్కోవలసి రావటం దురదృష్టకరం. ఆయన భూసంస్కరణల నినాదం, వాటిని అమలు జరపాలనే మొక్కవోని సంకల్పం ఆయన పదవీచ్యుతుడు కావడానికి దారితీసాయి. ఒకసారి పాలెం గ్రామంలో (మహబూబునగరం జిల్లా, బహిరంగ సభలో మాట్లాడగా నేను విన్నాను. భూస్వాములపై ఆయన విసరిన విసరులు, కష్టజీవులైన పేద రైతులను ఆయన వెనుకేసి కొని వచ్చిన తీరు, కేంద్రప్రభుత్వ విధానానికి అప్పటి ప్రధాన మంత్రి శ్రీమతి ఇందిరాగాంధి విధానాలకు పూర్తిగా అనుకూలమైన పాలసీయే అయినా, భూస్వాములను రెచ్చగొట్టింది. పనిగట్టుకొని వారు ఆయిన్ని దింపాలని దీక్షబూనారు. ఆంధ్ర రాష్ట్ర ఆందోళనను ఆ ఉద్యమానికి వారు బాగా వాడుకొన్నారు. పట్టుబట్టి పదవీచ్యుతుని చేశారు. పరిపాలనా పరమైన కారణాలెన్ని చెప్పినా, భూసంస్కరణల ఉద్యమమే ఆయన పదవికి కంటకంగా పరిణమించింది. ఇది చారిత్రక సత్యం.

1977 ఎన్నికల్లో కాంగ్రెసు పార్టీ కేంద్రంలో అధికారం కోల్పోయినాక, ప్రలోభాలకు లోనుగాక పార్టీలోనే కొనసాగారు పి.వి. లోకసభ సభ్యునిగా ప్రతిపక్షంలో ఉండి తన పాత్రను హుందాగా నిర్వహించారు. ఒకసారి 1973-78లో మదరాసులో దక్షిణ భారత హిందీ ప్రచారసభ నుండి హైదరాబాదుకు ఫోనుచేసి మర్నాడు వారు హైద్రాబాదుకు రానున్నట్లు చెప్పి, తనను కలుసుకొమ్మని కోరారు. ఖాదీభండారు. (సుల్తానుబజారు)లో శ్రీ రామానంద తీర్థగారు ఉంటూ ఉండిన గదిలో కలుసుకున్నాము. లోకసభలో విద్యాశాఖ పద్దులపై తాను మాట్లాడవలసి ఉన్నట్లు చెప్పి, దేశం ఎదుర్కొంటున్న విద్యా విషయక సమస్యలపై నాతో ఒక గంటసేపు చర్చించారు. సమస్యల అవగాహన బాగా ఉన్నవారైనా తత్‌క్షణ సమస్యలను గురించి మేము చర్చించుకున్నాము. అంటే పార్లమెంటులో మాట్లాడే విషయంలో ఆయన కంత శ్రద్ధ, విద్యా సమస్యల పట్ల అంత ఆసక్తి ఉండిందన్నమాట. ఇందిరాగాంధి 1979లో మళ్ళీ ప్రధాన మంత్రి అయ్యాక ఆయన మంత్రిపదవిని స్వీకరించి నప్పుడు విదేశ వ్యవహారాలు లేక విద్యాశాఖ ఈరెంటిలో నీ కిష్టంవచ్చిన శాఖ కోరు కొమ్మన్నప్పుడు, విద్యాశాఖపై తనకు ఆసక్తి ఉండికూడా ఏ శాఖ ఇవ్వాలనేది ఆమెకే వదలి వేశారు. విదేశీ వ్యవహారాల మంత్రిగా ఆమె ఆయన్ని నియమించింది.

ప్రధాన మంత్రి అయ్యాక శ్రీ పి.వి. రక్షణ మంత్రిత్వ శాఖ చేపట్టారు. అచిర కాలంలోనే మానవ సంసాధనాల వికాసశాఖ అనే నూతన శాఖకు మంత్రిగా మార్చబడ్డారు. దేశ విద్యా విధానాన్ని పునర్నిర్మాణం చేయాలనే శ్రీ రాజీవ్‌గాంధీ సంకల్పానికి అనుగుణంగా విద్యాశాఖతో పాటు అనేకములైన ఇతర శాఖల కూడలి అయిన ఈనూతన మంత్రిత్వశాఖ నిర్వహణ బాధ్యతను శ్రీ పి. వి. కి అప్పచెప్పారు. రక్షణ మంత్రిత్వ శాఖ నుండి ఈ నూతన శాఖకు బదిలీ కావటం ఆయన పదవిని తగ్గించినట్లయిందని అక్కడక్కడ వచ్చిన విమర్శలకు శ్రీ రాజీవ్‌గాంధీ ఒక బహిరంగ సభలో సమాధానమిస్తూ అది చాలా ముఖ్యమైన మంత్రిత్వ శాఖ అనీ, దేశంలో మానవ వనరులను సమీకరించే బృహత్తర బాధ్యతగల శాఖ అనీ, కావుననే శ్రీ నరసింహారావు వంటి సీనియర్ మంత్రికి ఆ శాఖ బాధ్యత ఇవ్వబడ్డదనీ ప్రకటించారు. సుమారు నాలుగు సంవత్సరాల తరువాత శ్రీ పి.వి.ని ఆ శాఖ నుండి మార్చి విదేశ వ్యవహారాల శాఖను నిర్వహించే బాధ్యత అప్ప చెప్పారు శ్రీ రాజీవ్ గాంధీ. అయితే నా అభిప్రాయంలో మానవ వనరుల వికాసశాఖ మంత్రిగానే ఆయన రాజకీయ జీవితంలో అత్యున్నత ప్రమాణానికి చెందిన కార్యం నిర్వహించారని అనుకుంటాను.

## నూతన జాతీయ విద్యా విధానం

రాజీవ్‌గాంధి ప్రధానిగా ప్రమాణ స్వీకారం చేసిన తరువాత తొలి ప్రసంగంలోనే ఇతర అంశాలతో పాటు దేశవిద్యావిధానాన్ని యువజనుల ఆశలకు ఆశయాలకు, దేశ అవసరాలకు అనురూపంగా ఉండేటట్టు మార్చగలనని ప్రకటించారు తదనుసారం ఆగస్టు 1985లో కేంద్ర విద్యా మంత్రిత్వశాఖ పక్షాన "Challenge of Education" అనే ఒక ప్రచురణ వెలువడింది. శ్రీ కె.సి. పంత్ అప్పుడు విద్యాశాఖ మంత్రి. ఇది ఒక Status Paper అంటే విద్యారంగం యొక్క ప్రస్తుత పరిస్థితిని ఉన్నదున్నట్టుగా చిత్రించిన పత్రం. కేంద్ర ప్రభుత్వం దేశ విద్యావిధానం విఫలమైనట్లు నిస్సంకోచంగా ఒప్పుకున్న పత్రం కూడా. ఆ పత్రం పై కేంద్ర ప్రభుత్వం ప్రజాభి

ప్రాయాన్ని ఆహ్వానించింది. దేశంలో పలుచోట్ల సభలు, సమావేశాలు, చర్చాగోష్ఠులు జరిపి విద్యా వేత్తలు, ఉపాధ్యాయ సంఘాలు, రాష్ట్ర ప్రభుత్వం, విశ్వవిద్యాలయాలు, విద్యార్థుల సముదాయాలు విద్యావిధాన సంస్కరణను గూర్చిన తమతమ అభిప్రాయాలను వెల్లడించాయి. ఈ చర్చలు జరుగు తున్న తరుణంలోనే మానవ వనరుల వికాసశాఖ అనే నూతన మంత్రిత్వశాఖ కేంద్రంలో ఏర్పరచి శ్రీ పి. వి. ని ఆ శాఖకు మంత్రిగా నియమించారు ప్రధాని. ఆ ప్రకటన జరిగిన వెంటనే అయనతో నేను టెలిఫోన్‌గా మాట్లాడాను. ఈ నూతన శాఖను చేపట్టినందుకు అభినందించాను. ఎంతో ఉత్సా హంగా కనపడ్డారు.

నూతన మంత్రిత్వశాఖ చేపట్టిన మరుక్షణం నుండే భారతదేశానికి నూతన విద్యావిధానానికి రూప కల్పన చేసే కృషి యందు శ్రీ పి.వి. నిమ గ్నులయ్యారు. ఈ జాతీయ విద్యావిధానాన్ని రూపొందించడానికి మళ్ళీ ఒక కమిషన్ వెయ్యాలా? ఎలా చేయాలి అని పలువురితో చర్చించారు. నన్నడిగినప్పుడు అలాంటిదేదీ చేయ వద్దనీ, కొఠారి కమిషన్ నివేదిక ఉండనే ఉందనీ, కేంద్ర ప్రభుత్వం వెలువరించిన పత్రంపై దేశ వ్యాప్తంగా చర్చలు జరుగుతున్నాయనీ తాము స్వయంగా కొన్ని వర్గాలతో చర్చించ వచ్చనీ ట న్నిటినీ ఆధారంగా చేసుకొని తామే ఒక ముసాయిదా వ్రాయగల సమర్థులని చెప్పాను. ఒక కమిషనో, కమిటియో వేస్తే అనవసరమైన కాలయాపనకు దారి తీస్తుందని కూడా చెప్పాను. డిసెంబరు 1985 జనవరి 1986 వరకు చాల మటుకు నూతన విద్యా విధానంపై చర్చలు ముగిశాయి. ఈలోగా నాగ పూర్‌లో జిల్లా పరిషత్తుల ప్రతినిధులను, రాష్ట్రాల లోని ఎగువ సభలలోని ఉపాధ్యాయ ప్రతినిధులను, గ్రాడ్యుయేట్ల ప్రతినిధులను (ఆంధ్రప్రదేశ్ నుండి మాజీ ప్రతినిధులకు కూడా) సమా వేశ పరిచారు. శ్రీ పి.వి. దానికి హాజరైనారు. ఆ సభలో చర్చలు ఉపయుక్తంగా జరిగాయి. ఆ తరువాత ఢిల్లీలోను ఆయన మంత్రిత్వశాఖ పక్షాన జట్టులు జట్టులుగా కొందరు విద్యావేత్తలతో వివిధ అంశాలపై ప్రత్యేక కమిటీలు ఏర్పాటు చేయబడ్డాయి, వీటిల్లో చాలా వాట్లలో నేను పాల్గొన్నాను. ఆయన సలహా మేరకో కాదో నేనెరుగను కాని ఆయన మంత్రిత్వశాఖలోని అధికారులు నన్ను తరుచుగా ఈ సమావేశాలకు అహ్వానించారు. హైదరాబాదులో **Progressive Educational Trust** పక్షాన నేను శ్రీ డి. సంగమేశ్వరరావు, శ్రీ సి. సుదర్శన్ మరి కొందరు మిత్రులం కలసి ఒక నివేదిక రూపొం దించి కేంద్రప్రభుత్వానికి సమర్పించాము. నవం బరులో హైదరాబాదులో అఖిలభారత సెకండరీ ఉపాధ్యాయుల సమాఖ్య పక్షాన నవంబరు 1985లో జరిగిన ఒక అఖిలభారత సెమినారులో నేను గావించిన ప్రధాన ప్రసంగాన్ని శ్రీ పి వి. చూచారు. ఆయన మంత్రిత్వ శాఖలోని అన్ని విభాగాలకు ఇతర నివేదికలతో పాటు నా ప్రసంగాన్నికూడా సర్క్యులేటు చేయించారు.

ఇలా విస్తృతమైన చర్చల అనంతరం ఆయన మంత్రిత్వశాఖ అధికారులే ఆయన సలహా ననుసరించి కొందరు ప్రముఖ విద్యావేత్తల సహ కారంతో ఒక ముసాయిదా సిద్ధంచేశారు. నేనొక సారి 1986 మార్చిలో నో-ఏప్రిల్ లోనో సరిగా జ్ఞాపకంలేదు. ఢిల్లీలో జరిగిన అలాంటి ఒక సమా వేశంలో పాల్గొని హైదరాబాదుకు తిరిగి వస్తుండగా అదే విమానంలో శ్రీ పి. వి. ప్రయాణంచేస్తున్నారు. నన్ను చూచి "మీరు ఢిల్లీ వచ్చిన సమాచారం నాకు తెలియదే. తెలిసివుంటే నేను మీతో ఒక ముఖ్యమైన విషయం మాట్లాడ ఉండేవాడిని" అన్నారు. ప్రతి సారి ఢిల్లీ వెళ్ళినప్పుడల్లా ఆయన్ని కలసి ఆయన

కాలాన్ని ఎందుకు వృథాచేయాలని అప్పుడప్పుడు మాత్రమే కలుసుకుంటూ ఉండేవాడ్ని. అదే మాట ఆయనకు చెప్పాను. ' ఈ రాత్రి హైదరాబాదులో మీరొక పని చేసి పెట్టాలి. డ్రాఫ్ట్‌పాలసీ నావగ్గర సిద్ధంగా ఉంది. అది ఈ రాత్రే మీరు చూచి రేపు తెల్లవారి 5-30 కు దానిపై మీ అభిప్రాయాన్ని నాకు తెలియజేయాలి. రేపే ప్రధానితో దాన్ని గురించి చర్చించాల్సి ఉంది" అన్నారు. హైదరాబాదులో విమానం దిగగానే ఆయన ప్రైవేటు సెక్రటరీకి చెప్పి నాకు వాహనాది సౌకర్యాలు ఏర్పాటు చేశారు. ఇంట్లో కూర్చుంటే ఈ పని జరగదని రాజ్‌భవన్‌లోనే ఆ రాత్రి ఉండిపోయి ఆ డ్రాఫ్ట్‌ను చదివి నాకు తోచిన కొన్ని అభిప్రాయాలను ఒక కాగితం పై వ్రాసి తెల్లవారు జామున 5-30 కు ఆయనకు అప్పచెప్పాను. పాలసీ ముసాయిదా అప్పటికే ఒక మంచి రూపం దాల్చింది. కాస్త దీర్ఘంగా ఉండింది. పాలసీ పత్రం ఎంత సంక్షిప్తంగా ఉంటే అంత మంచిదని, కనుక దాని ప్రమాణాన్ని కాస్త తగ్గించమని నా అభిప్రాయం చెప్పాను. పాలసీ అంతిమరూపం పది పన్నెండు పేజీలు తగ్గి జాతీయ అభివృద్ధిమండలి ఆమోదం పొందిన తర్వాత-అంటే అన్ని రాష్ట్రాల, కేంద్ర పాలిత ప్రాంతాల ముఖ్య మంత్రుల సమ్మతి తర్వాత - మే 1986లో పార్లమెంటుకు సమర్పింపబడ్డది.

స్వతంత్ర భారతదేశ విద్యా చరిత్రలో పార్లమెంటు ఆమోదం పొందిన మొదటి జాతీయ విద్యా విధానమిది. 1968లో ఒక జాతీయ విధానం ప్రకటించబడింది. 1964లో కేంద్ర ప్రభుత్వం డా॥డి. యస్. కొఠారి అనే శాస్త్రవేత్త అధ్యక్షతలో ఒక విద్యా విషయక సంఘాన్ని నియమించింది. 1966లో ఆ సంఘం ఒక సుదీర్ఘమైన నివేదిక సమర్పించింది. దానిపై దేశ వ్యాప్తంగా చర్చ జరిగిన అనంతరం, వివిధ పార్టీలకు చెందిన పారమెంటు సభ్యుల సంఘం నివేదిక కూడా పరిశీలించి, కేంద్ర ప్రభుత్వ విద్యామంత్రిత్వశాఖ ఒక తీర్మానం ద్వారా 1968 జాతీయ విద్యావిధానాన్ని ప్రకటించింది. అయితే అది చిత్తశుద్ధితో అమలు జరుగలేదు. 17 సంవత్సరాలు గడిచాయి. దేశ విద్యా విధానం అస్తవ్యస్తమై ఉన్నది. అందుకే ఈ నూతన జాతీయ విద్యా విధానం రూపొందింపబడ్డది. దాన్ని రూపొందించే శ్రేయస్సు శ్రీ పి. వి.కి దక్కింది.

1986 మేనెల 6-8 తేదీలలో జాతీయ విద్యా విధానాన్ని లోక సభ చర్చించి ఆమోదించింది. తర్వాత రాజ్యసభ ఆమోదించింది. లోకసభలో జరిగిన చర్చకు సమాధానమిస్తు శ్రీ పి. వి. చేసిన ప్రసంగంలో విధాన పత్రాన్ని విశ్లేషణ చేశారు. అది చదివితే విద్యా సమస్యల యెడ ఆయనకున్న అవగాహన, చిత్తశుద్ధి స్పష్టంగా వెల్లడి అవుతాయి. మరోవైపు తరగతిలో ఉపాధ్యాయుడు పిల్లలకు పాఠాలు అర్థమయ్యేటట్లు చెప్పడానికి చేసే సఫల ప్రయత్నంలా సరళంగా, సోదాహరణంగా ఉంటుందా ప్రసంగం. సార్వత్రిక ప్రాథమిక విద్యా పథకాన్ని విజయవంతం చేయడానికి ఉద్దేశించి ప్రాథమిక పాఠశాలల అభివృద్ధికై రూపొందింపబడిన 'ఆపరేషన్ బ్లాక్ బోర్డు' పథకం, గ్రామీణ పాఠశాలల్లో సైతం సాంకేతిక పరికరాలను ప్రవేశపెట్టడం, పాఠశాలల్లో ప్రవేశించిన బాలబాలికలు విద్య ముగిసే వరకు కొనసాగే 'రిటెనన్' పథకం, విద్యా సౌధం పునాది మొదలు శిఖరాగ్రం వరకు పటిష్ఠంగా ఉండే కార్యక్రమం—అంటే శిశుదశ నుండి ఉన్నతోన్నతదశవరకు-శాస్త్ర, సాంకేతిక విద్య, వృత్తి విద్య, భారతీయ సంస్కృతిని సంపన్నం చేయడానికి విద్యను ప్రజల సాధనంగా ఉపయోగించడం, నిరక్షరాస్యత నిర్మూలన జాతీయ లక్ష్యాలైన ప్రజాస్వామ్యం, సామ్యవాదం,

లౌకిక విధానం, జాతీయ సమైక్యత — ఇవన్నీ ప్రతిఫలించే మౌలిక ప్రణాలిక, సాంఘిక, వైయక్తిక విలువలను పోషించడం, వ్యాయామం, ఆటలు మున్నగు వాటిని వృద్ధి చెందించడం, జీవితాంత విద్య, హరిజన, గిరిజన వర్గాలు, మహిళలు, వికలాంగులు, ఇతర బలహీన వర్గాల విద్యాభివృద్ధి, వారి అవకాశాంలో సమానత్వం — ఇలా విద్యా వ్యవస్థకు సంబంధించి, జాతీయ విద్యా విధానంలో అంతర్గతములైన ముఖ్యాంశాలన్నింటినీ ఆ ప్రసంగంలో శ్రీ పి.వి. స్పృశించారు.

## నవోదయ విద్యాలయాలు :

విద్యా విధానం శిష్టజనానుకూలమైనది (elitist) అనే విమర్శ పార్లమెంటులోనూ, వెలుపలా వచ్చింది. ఆ విమర్శకులు తమ వాదనకు అనుకూలంగా ఉదాహరించిన అంశం ప్రధానంగా నవోదయ విద్యాలయాల స్థాపన. ఆ విద్యాలయాలు జిల్లాకొకటి స్థాపించాలనీ, గ్రామీణ విద్యార్థులలో బుద్ధికుశలురైన వారిని ఎన్నుకొని వారికి ప్రవేశం కల్పించాలనీ, ఉచిత విద్య, ప్రతిపాఠశాలలో రాష్ట్రేతర ప్రాంతాల నుండి కనీసం 20% విద్యార్థులకు ప్రవేశం కల్పించాలనీ ఈ పథకం ఉద్దేశ్యం. ఈ పథకం ఆచరణలో జాతీయసమైక్యం '(National Integration in action) అనిశ్రీపి.వి.సమర్థించారు ఇప్పటికీ ఈ విద్యాలయాల పథకం వివాదాస్పదంగా ఉంది. నేషనల్ ప్రభుత్వం వారు దాన్ని మందగింప జేశారు. ఇప్పుడు మళ్ళీ ఆ విద్యాలయాల విస్తరణ చేస్తామని కేంద్రం ప్రకటించింది.

జాతీయ విద్యావిధానాన్ని గురించి ఇంతకన్న ఎక్కువ వివరాలు ఈ వ్యాసం పరిధిలో చెప్పడం సాధ్యపడదు. ఈ విధానం మొత్తంపైన దేశహితానికి ఉపయోగ పడేదని మాత్రం నిస్సందేహంగా చెప్పవచ్చు. జాతీయ విద్యా విధానం పార్లమెంటు ఆమోదించిన మూడు మాసాలలోనే దాన్ని కార్యాన్వితం చేయడానికి 'కార్యాచరణ పథకం' (Programme of Action) సిద్ధపరచి, 1986 ఆగస్టులో దానిని కూడా పార్లమెంటుకు సమర్పించి, చర్చించి, ఆమోదం పొందారు. శ్రీ పి. వి. విద్యావిధానాన్ని అమలు పరచాలనే సంకల్పానికి ఇది మరొక నిదర్శనం. గతంలో ఇలాంటి చర్యలు ఏవీ జరుగలేదు.

అలాగే విద్యావిషయక కేంద్ర సలహా సంఘాన్ని పటిష్ఠంచేసి, జాతీయ విద్యావిధానం అమలు జరిగే తీరును ఎప్పటికప్పుడు ఆ సంఘం పరిశీలించేటట్లు కూడా శ్రీ పి. వి. చర్య గైకొన్నారు. మూడున్నర సంవత్సరాలు నాకాసంఘంలో సభ్యునిగా ఉండే అవకాశం లభించింది. శ్రీ పి. వి. దాన్ని శక్తివంతమైన సంస్థగా రూపొందించే ప్రయత్నం చేశారు. దాన్ని ఇంకా సమర్థవంతమైన దాన్నిగా చేయాలని అనుకొంటున్న సమయంలో విదేశ వ్యవహారాల శాఖకు మార్చబడ్డారు. ఇప్పుడు జాతీయ విద్యావిధానానికి సంబంధించిన అన్ని కార్యక్రమాలను ఉధృతంగా నడిపించే సదవకాశం ప్రధాన మంత్రిగా ఆయనకు ఇతోధికంగా లభించింది.

అంత పట్టుదలతో విద్యావిధానాన్ని అమలు పరుచ బూనుకున్న శ్రీ పి.వి.కి గతంలో తగినంత ఆర్థిక వనరులు చేకూరలేదు. 1987-88 సంవత్సరాలలో జాతీయ విద్యావిధానం కార్యాన్వితం చేయడానికై 800 కోట్లు ధనం లభించింది. ఇతర దేశాలనుండి విద్యాభివృద్ధి పథకాలకు మరో 200 కోట్లు లభించాయి. ఆయన మంత్రిత్వశాఖలో ఉత్సాహం కలిగింది. కార్యక్రమాలు ముమ్మరంగా చేబట్టారు. కాని మరుసటి సంవత్సరం నుండి కేటాయింపులు పెరుగలేదు. యథా తథంగానే

అంటే 800 కోట్లు మాత్రమే లభించింది. అప్పటి ప్రధాని దృష్టి ఇతర కార్యక్రమాలపైకి మళ్ళింది. ఇంతలో ఎన్నికలు వచ్చాయి. ప్రభుత్వం మారింది. విద్యావిధానం అమలు మందకొడిగా సాగింది. ఈ సంవత్సరం కాస్త ఒళ్లి ఉత్సాహం కనపడుతున్నది. సంకట ఆర్థిక స్థితిలో కూడా ఈ యేడు విద్యాశాఖకై 977 కోట్లు బడ్జెటులో కేటాయించారు. ఇది శ్రీ పి. వి. చొరవ వలనే జరిగిఉంటుంది. సీనియర్ మంత్రి, విద్యాధికుడు అయిన శ్రీ అర్జున్ సింగ్‌కు మానవ వనరుల వికాసశాఖను అప్పజెప్పారు. రానున్న రోజులలో దేశవిద్యా ప్రగతికి అనుకూల్యం ఉండేటట్లు కన్పిస్తున్నది.

అయితే దేశ ఆర్థికస్థితి బాగా క్లిష్టదశలో పడిపోయింది. రాజకీయంగా అస్థిర వాతావరణం మెరుగుకాలేదు. పార్లమెంటులో తగినంత సంఖ్యాబలం లేదు. ఉగ్రవాదుల హత్యాకాండ కొనసాగుతూనే ఉంది. అయినా విజ్ఞతతో, కలుపుగోలుతనంతో, సహజమైన ప్రతిభతో శ్రీ పి. వి. దేశాన్ని ముందుకు తీసుకపోగలుగుతారని ఆశిద్దాము. దేశపరిపాలనా నిర్వహణ బాధ్యత ఆయనకు అప్పజెప్పిన చారిత్రక పరిస్థితులే, దేశసమస్యల పరిష్కార మార్గాన్నికూడా సుగమం చేయగలవని దేశభక్తులు ఆశించడం అత్యాశకాదను కొంటాను. విజ్ఞులైన భారతప్రజలు ఆయనకు అండదండలుగా నిలుస్తారని ఆకాంక్షిద్దాము.



# 1. కావ్యోపాసన

శ్రీ శంకరగంటి రంగాచార్యులు

జగత్సృష్టిలో భాషాశక్తి అద్భుతమైనది. ఆ శక్తిలోనిసహజ భాగము కన్న కవులు దానికి సంపాదించి పెట్టిన కృతక భాగము తక్కువైనదేమియు కాదు. భూ గర్భములో నుండి అయశ్శిలను ఎత్తి తీసి, దాని నుండి ఇనుము ఉక్కులను, కొడవలి సూదులను నిర్మించుకొని యుండుట ఎంతటి పౌరుషసిద్ధియో, నదీవేగము నుండి విద్యుచ్ఛక్తిని వెలార్చి ఇంటికి వెలుగును, పొయ్యికి వేడిని తెచ్చుకొని యుండుట ఎంతటి పౌరుషాద్భుతమో, భాషను కావ్యశాస్త్ర ప్రబంధ రూపములకు మలచి, మనోబుద్ధుల వికాసమునకును, జీవనోన్నతికిని సాధనములను ఒదవించుకొని యుండుట అటువంటి పౌరుష విజృంభణమే. దీనిని భాషలో వ్యవహరించు వారందరును–పాఠకులును, రచయితలును కూడ–సంతతముగ దృష్టిలో నుంచుకొన వలెను. భాష ఎటువంటి మహాసత్త్వమో, దానినుపయోగించు అవకాశము ఎటువంటి పవిత్ర సందర్భమో, ఉపయోగించు వారి బాధ్యత ఎంత పెద్దదో–అన్న మూడంశములను కనుగొనని వారు సరస్వతీదేవి సేవ కర్తలు కారు. వారికామె ప్రసాదము దొరకనేరదు. వాల్మీకి తన ఉత్తమ పాత్రలను మనకు పరిచయము చేయునపుడు, 'వాగ్విదాంవరః', 'వాక్య విశారదః', 'వాక్యకోవిదః'– ఇటువంటి మాటలను ప్రయోగించినాడు వాని అంతర్భావము మనకు అనుచింతనీయమైనది. వ్యాసుడు కూడ అట్లే వాగ్విశారదులను ప్రశంసించి యున్నాడు.

పద్యమల్లు అభ్యాసము కలవాడు కావ్యతత్త్వ జిజ్ఞాసలో చేయి వేయుట తన యింటికి తానే మారిని పిలిచినట్లు. అతడు చేసిన సిద్ధాంతమును అతడల్లిన కావ్యమైనను సమర్థించునా? అదియే అట్లు చేయకపోయినపుడు, ఆ సిద్ధాంతమునకు వెలయేమి? లేక ఆ సిద్ధాంతమే యుక్తమని లోకమంగీకరించిన పక్షమున, దాని ననుసరించని అతని కావ్యమునకు చెల్లు వెలయేమి? అతని సిద్ధాంత దృష్టాంతములు రెండును కూడ లోకము నిరాకరించుట అసంభవము కాదు. ఇట్లు అన్ని ప్రక్కలను అపాయమున్నను అతని సాహసమున ఒక గుణముండవచ్చును. కావ్యరచన, తత్త్వ విమర్శ ఈ రెండు పనులను అతడు కేవలము పరీక్షా ప్రయోగమని నడిపించినచో దానిచేత అతనికి కొద్ది ప్రయోజనము అయినను కానవచ్చును. ఉభయ మార్గములందును అన్వేషియై బయలుదేరిన వానికి ఒక మార్గమున వచ్చిన అనుభవజ్ఞానము మరొక మార్గ ప్రయాణమునకు సహాయకము కావచ్చును. ఇట్లు ఆ రెండు ప్రవృత్తులును పరస్పరోపకారకములు కావచ్చును.

## రహస్యము

కావ్యక్రియ ఒక రహస్యము. ఈ మాట నేను పదేపదే చెప్పుచున్నాను. రహస్యమన్న భేదించ నేరనిది. అయినను, కావ్య రహస్యమును గురించి

నేను ఊహాపోహ[స్పెకులేట్]చేయుచునేయున్నాను. మునుపు వేలాది మంది చేసిన కార్యమది. నాతో నైనను అది ముగియ వచ్చునను భరోసా యొక్క పూర్వచ్ఛాయ కూడ నాకు దూరముననూ కానరాలేదు. ఆ పని ఇంకను చిరకాలము నడచుననియే తోచును. అట్లు తోచిన తరువాత కూడ ఈ రహస్య భేదనకు పునఃప్రయత్నమేల? అని ప్రశ్న. అదికూడ ఒక రహస్యము.

పిల్లవాని చేతికి గడియారము నిచ్చిన వాడు దానిని కొరుకును; కొట్టును; పగులగొట్టును; మాటలు వచ్చి యున్నచో ఏమేమియో ప్రశ్నలు వేయును. ఆ పిల్లవాడు అట్లు చేయుటకు అంతః ప్రేరణయే కారణము. అది ఒక రహస్యము. వాని బుద్ధికి ప్రశ్న ఎందుకు తోచవలెను? ప్రశ్న తోచిన కూడ అతని బుద్ధి ఎందుకు ప్రకోపించవలెను? బహిః ప్రపంచ మునకును, అంతర్బుద్ధికిని మధ్య పరస్పరము కలుగుచున్న ఆరాట పోరాటములు కారణము. అది స్వాభావిక విషయము. అదియె ప్రకృతికార్య రహస్యము. ఆ ప్రచోదన, ప్రతివర్తనముల చేతనే మానవ ప్రగతికలుగును. దానిలోనిఒకఅంశము సాహిత్యము.

కావ్యము మనుష్య కార్యము. అయినను అది రహస్యము. ఎందుకన్న, మనుష్యుడే ఒక రహస్యము. తన అంతఃప్రవృత్తులనన్నిటిని తల స్పర్శిగా తెలిసికొన్న మనుష్యుడెక్కడ కలడు? స్వప్రవృత్తులు కొంతకొంత తెలిసినను, వాని మూల కారణములు, సంబంధములు తెలిసిన వాడె వడున్నాడు? మనుష్య స్వభావమున కార్య కారణ సంబంధ విచారణకు దొరకని అంశములు లెక్కలేనన్ని ఉన్నవి. మనస్సొకగుహ. దాని నిండ భూతములు. వానిని ప్రకృతి బీజము లందుము; అదృష్టమందుము. ప్రకృతియో, దేవుడో, అదృష్టమో-మన పరీక్షా పరామర్శలకు దొరకక దాగి కొనియున్న సంగతి-రహస్యము. మనుష్యుని స్వభావములో ఇట్టి రహస్యములున్నంత వరకును అతని రచనలును, ఆ రచనలలో ఒకటగు కావ్యమును రహస్యములే.

ప్రతి మనుష్యునికిని ఒక వ్యక్తిత్వముండును. అది రహస్యము. కవి అసాధారణ మనుష్యుడు, కావున అతనిది అసాధారణ వ్యక్తిత్వము. ఆ వ్యక్తివైశిష్ట్యపు బహిః ప్రకటనమే కావ్యము. వైయక్తిక ప్రతిభ లేనిదే నిజమైన కావ్య లతలేదు. ఆ వ్యక్తి ప్రతిభ రహస్య వస్తువు. అది రహస్యమని తెలిసియు కూడ మనము ఇంకను దానిని పట్టి పిసుకవలయునను నడెందుకు? అది మన వశమునకు వచ్చినంత రానిమ్మనుట ఒక యోచన. ఆ ప్రయత్నము వలన మన అన్వేషణ శక్తి మరింత పరిణతము కావచ్చుననుట రెండవ యోచన. ప్రకృతి విజ్ఞానములో—భౌతికశాస్త్రము, రసాయనిక శాస్త్రము, వృక్షశాస్త్రము, భూగర్భ శాస్త్రము, జంతుశాస్త్రము-మొదలగు సృష్టి సిద్ధ వస్తువుల గురించిన నానాశాస్త్రములలో-తుట్టతుది సిద్ధాంత మన్నది దొరకలేదనియు, అయినను అక్కడ సిద్ధాంతమునకన్నను సంవిధానమే మనకు ముఖ్యమనియు చెప్పుదురు. సకల రీతుల తత్త్వాన్వేషణలకును - ఆ మాట అన్వయించును. కావ్య మీమాంసలో మనకు రహస్యాంశము కైవసము కాకున్నను, కవి కార్య తంత్రము (టెక్నిక్) అంతయో ఇంతయో కనులకు కనిపించును. అదియే ఒక లాభము. బ్రాహ్మణ వర్ణస్థులలో ఒక సాంప్రదాయము కలదు. అది అరుంధతీ దర్శనమన్నది. వివాహమైన దినము సాయంకాలము పురోహితుడు వధూవరులచేత అరుంధతీ దర్శనము చేయించును. వశిష్ఠుడు సప్తర్షులలో ఒకడు; అరుంధతీ అతని పత్ని; పాతివ్రత్యమున కాధారభూతురాలు. వారిద్దరును నక్షత్రరూపమున ఒకరి ప్రక్కన ఒకరు అంతరిక్షమున నున్నారు. అతిసూక్ష్మమైనది అరుంధతీ

నక్షత్రము. పురోహితుడు వధూవరుల కాచిరుతార
కను చూపవలెనని, వారిని పెండ్లి పందిరి నుండి
బయటికి పిలుచుకొని వచ్చి, ఉత్తర దిశకు ముఖము
త్రిప్పి,నిలిపి, మొదట సప్తర్షిమండలమునుగుర్తించు
నట్లు చేయును. తరువాత అందులో వశిష్ఠ నక్షత్ర
మును గుర్తించునట్లు చేయును. అది తెలిసిన దన్న
తరువాత దాని ప్రక్కన కనులు చిన్నవిగా చేసి
చూడుడనును. కనులెంత చిన్నవిగా చేసినను,
ఎంత వెదకినను, అరుంధతీ దర్శనమగుట ఖచ్చిత
మయిన మాటకాదు. బహు సూక్ష్మమగు నేత్ర
పాటవయును, బహుతాలిమియు ఉన్నవారికి
మాత్రము ఆ దర్శనము సాధ్యము. ఆ నేత్ర తీక్ష్ణ
తయు, ఆ సహనమును లేనివారికి అరుంధతీ
దర్శనము వట్టి నోటి మాట. కాని ఇట్టివారు పడు
ప్రయాసమును నిష్ఫలము కాదు. వారికి సప్తర్షి
పరిచయము మాత్రము తప్పక అగును. అది
కొద్ది లాభము కాదు. కనులకు కొంత వ్యాయా
మము కలుగును. అదియును మంచిదే. స్వల్పకాలపు
టభ్యాసమున దృష్టి సూక్ష్మమై తరువాత వారు అరుం
ధతిని చూడగలుగవచ్చును. అన్ని రహస్యాన్వేషణలు
లాభా లాభముల లెక్కయును ఈ రీతిదే. మామిడి
కాయను రాల్చుటకు విసరిన రాయివలె, గురిపెట్టిన
కాయ ఒకటి;నేలకు పడినది. మరియొకటి. అథవా,
కొలంబసు ఇండియాను కనుగొన బయలుదేరి,
అమెరికాను కనుగొన్నట్లు. అది అనుద్దిష్టలాభము-
అయినను, లాభమే. ఆ లాభమునకు తోడు మరి
యొకటి కలదు. కవి కార్యతంత్రపుటంతః స్వరూ
పమును మనము కనుగొన్న కొలదియు కావ్యాస్వాద
స్యగ్రహణము మనకు సులభమును, విశదమును
అగును.

కావ్యతత్త్వ విచార గ్రంథముల ముఖ్యప్రయో
జనము కవికగుదానికన్న ఎక్కువగా కావ్యపాఠ
కునికి లభించును. కవియైన ప్రతివాడును లక్షణ
గ్రంథములు చదివియే తనపనికి పూనుకొనియుందు
రని అనుటకు ఆధారము లేదు. కాళిదాసభవభూతులు
లక్షణగ్రంథములు చూచి యుండవచ్చును. వాల్మీకి
వ్యాసుల విషయమున ఆమాట చెప్పుట సాహసము.
వేదమున కవివాక్కు అపారముగా నున్నది. ఆ
ఋషి కవులు అలంకార శాస్త్రములు పఠించిన
పిదప మంత్రములు చెప్ప ప్రారంభించి రనుట
అతి సాహసము. గోపకథ వ్రాసిన వాడును,
కనక దాసుడును ఉత్తమ కవిత కాదర్శ
ప్రాయులు. వారు లక్షణశాస్త్ర శిక్షితులని చెప్పుట
కష్టము. కావ్యరచన ఒక అంతశ్శక్తి విశేషము
వలన ఎట్లో అగును- కాని కవి చమత్కారమటు
వంటిదని మనకు అంతింతయున తెలియవలయు
నన్న అతని కర్మాగారముయొక్క యంత్రరచ
నను అయినంత వరకు తెలిసికొనుట మనకు
సహకారి.

## అనేక రసపాకముల వలన ఒక అధిరసము

కావ్య కర్మ-కవి మానసిక కల్పనా వ్యాపా
రము ముగిసి, తరువాత దానిని అతడు వ్యక్తము
చేయు సమయమున—శబ్దప్రపంచపు నానా ధాతు
వుల సమ్మిశ్రిత పాకము. మన నిత్యజీవనపు బహి
రింద్రియ ప్రపంచమున భోజ్య, ఔషధ, పరిమళ
లేపనాది వస్తువుల రచన ఎట్లు ఒకానొకభౌతికరసా
యనిక వ్యాపారమో మన అంతరింద్రియ ప్రపంచ
మున కావ్యకర్మ అట్లు ఒక సూక్ష్మతరమైన భౌతిక
రసాయనిక సంఘటన. పూర్వికులు కవికార్యమును
'పాకము' అని పేర్కొని యుండుట బహుసమంజస
మయినది-ద్రాక్షపాకము, నారికేళపాకము అన్నట్లు
అది అనేకపాకములను ఏకహారముగా బట్టిపట్టు
విధానము. ఆ సారమును మనము
చవిచూచుచు, దాని మోహమునకు

పరవశులమై, మనసా వేరొక లోకమున కరిగి, అక్కడి అద్భుత సుందర చిత్ర జీవులతో కలిసిపోదుము-దివ్యభ్రాంతి పరవశుల మగుదుము. ఆ పాక సంవిధానము కూడ కవి యొక్క వ్యక్తి ప్రతిభకు సంబంధించిన క్రియా విశేషము.

అట్లు బట్టి దిగకపోయిన,క్షణమాత్రమైనను-ఆ దివ్యమాయావరణ కారకమైన పాక సంసిద్ధి లేకున్న-కవి కృతకృత్యుడు కాలేడు. వంటయన్న ఉడికించుటమాత్రముకాదు. వార్చడముమాత్రముకాదు. దించుటొకటి కాదు; కెలకుటొకటి కాదు:-ఈ అన్ని పనుల మొత్తము పదనది. అది వట్టి ఉప్పుకాదు; పులుసుకాదు;వట్టిబెల్లము,కాదు. మిరియముకాదు, వట్టి నెయ్యికాదు, ఆవాలుకాదు, అది ఈ నానా రుచుల సరస సమ్మేళనము. నాలుక, పండ్లు, ముక్కు, కనులు, జీర్ణకోశము-ఈ అనేకాంగములకు హితము కావలసినది పాకము. అట్లు ధాతు రుచి గుణముల అనేకతలో ఒక సమ్మేళనైక్యమును కలిగించునది పాక ప్రావీణ్యము. నానా సామగ్రుల ఒక పరస్పర పరిమాణము, ఒకపరిపక్వదశ. అందుచేత ఒక రుచి వైవిధ్యపు సమవాయ రుచి-ఒక బహురస సామరస్యపు అధిరసము.ఇదే పచన తంత్రము. కవన తంత్రమునూ అట్టిదే. అక్షర గుణము, పద గుణము, మనోద్రవ్యము, బుద్ధి ద్రవ్యము-ఇవి నాలుగును కవి వ్యక్తిత్వ ప్రతిభా దివ్యాగ్నిజ్వాలలలో ఉడికి, పదనుకు వచ్చి, ఒకటి కావలెను. అనేకము నుండి ఏక వస్తు ఘటన కావలెను. శబ్దములును, అర్థములును పెరుగులో వడ్డ వడ్లవలె నుండరాదు. ఆ పెరుగెంత రుచియైన దైననేమి? ఆ వడ్లెంత సారము కలిగినవైననేమి? ఆ కలగాపులగమును భుజింపగలమా? అదే వడ్ల బియ్యమును పదనెరిగి అన్నము చేసి యుండిన, అపుడు దధ్యోదనపు దివ్యసుఖము. దానివలె నుండవలెను. కావ్యము లోని మాటలును, భావములును. ఆ రెండు జాతుల ద్రవ్యములును కరగి ఒక ద్రవమై వానిలో ఏది యును తానొకటే ఉన్నపుడు స్రవింపజాలని ఒక అధి రసమును ఆ మిశ్రణము ప్రసరించవలెను. పాయసమున పాలు, రవ్వ, చక్కెర, ఏలకుల సమ్మేళనము వలన కలుగునట్లు అచట నానారస, నానావాసనలకూడిక వలన బయలు వెడలును. ఒక క్రొత్త సమవాయ రుచి- ఒక సమవాయ సౌరభము ఏర్పడవలెను. ఆ కూడికయే స్వారస్యగ్రంథి. కావ్యపుటాకర్షకశక్తి. అట్టిశబ్దార్థముల ఏకాకారప్రవాహము వలన అందులో ఏక ధాతు మాత్రపు ఏకైక రుచికి సంబంధించిన వేదన మందత్వములేదు. నానా ధాతువుల, నానా రుచుల వ్యగ్ర విషత్వమునులేదు. పాకము బాగుగ జరిగియుండుట కదే ప్రమాణము. ఎచట ఒక అరక్షణమయినను ఆ అధిరసపు ఏకతానతకలదో, ఎచట వాగర్థములొకటై తంబుర శ్రుతిలో గాయకుని కంఠము కలియునట్లు పాఠకుని హృదయము కవి హృదయమున తల్లీనమై అంతయు ఏకతానమగునో, అచట కావ్యరస సిద్ధి యుండును.

సంగీతపు టుపమానము కావ్యమునకు చక్కగా సరిపోవును. ఈ రెండు కళల స్వారస్యమును - మూలానైక్యము — ఫలితైక్యము వలన. ఒక్కొక్క రాగమునకు పలు స్వరములు, ప్రకృతులు, వికృతులు, వాదులు, వివాదులు—చేరికొని యుండును. అయినను శాస్త్రజ్ఞుడు కానివాని చెవికి వినవచ్చి, మనస్సునకు సంతోషము కలిగించునది-ఒక రాగమే. రాగ మొకటే. దానిలోని వేరువేరు స్వరములు కావు.

యథా కుటుంబిన స్సర్వే ఏకీభూతా
భవంతిహి
తథా స్వరాణాం సందోహో గ్రామ

కుటుంబ సాదృశ్యమున్నది స్వరగ్రామమునకు మాత్రమే కాదు. నానావాద్య గాయక గీతములలో కూడ ఆ ఏకీభావమే స్వారస్యము. అదే 'మేళము'. నానాత్వము ద్వారా లభ్యమైన ఏకత్వమే కుటుంబపు సొగసు. అదే కావ్యపు సొగసు. బహుత్వపు సార్థక్యము, పరిణామపు దేకత్వము వలన. ఏకత్వమునకు కళవచ్చుట తదంతర్గతమగు బహుత్వముచేత. చిన్న పద్యముకానీ, బృహత్కావ్యముకానీ—ఎచట ఈ అద్వైత పాకపు టధిరసములేదో, అచట కావ్యత్వములేదు. అయిన, ఆ అధిరసమున్నదో లేదో, నిర్ణయించునదెవరు? కవి యొకడే కాడు; పాఠకుడొకడేకాడు. కవి పాఠకుల కిద్దరికిని ఐక్యసిద్ధి కలిగినపుడది కుదురును.

వాక్కుకు రెండు శక్తులు ఉన్నవి కదా. ఒకటి అక్షర మూలకమయినది; శ్రవణాకర్షకమయినది. మరియొకటి అర్థమూలకమైనది; మనోబుద్ధి గమ్యమయినది. లోకప్రసిద్ధమైన కొన్ని శబ్దములు చెవిని పడినంతనే, వాని సందర్భములు మనస్సుకు తోచును. గోడుగోడుమన్న ఏడ్పు; కిలకిలమన్న నవ్వు; ఉసూరుమన్న ఆయాసము; కిఱ్ఱన్న యాతన- ఇటువంటి అనుకరణ జనితములయిన సూచ్యార్థములును, లోకరూఢి నిఘంటువుల నుండి లభించు స్పష్టార్థములును మాత్రమే కాక, మనపూర్వానుభవపుటాధారము మీద ఊహాపోహలతో సిద్ధమగు మూడవశక్తి యొకటి భాషకున్నది. దానిని ధ్వనియని పేర్కొందుదు. మన ముపయోగించు మాటల 'రీతి' వలన ఉపయోగించకయున్న మాటల అర్థము ఒకటి వినువారి మనస్సుకు స్ఫురించునట్లున్న ఆ స్ఫురించిన అర్థమే 'ధ్వని'. దేవదత్తుడు దూరస్థలముననున్న తన స్నేహితుడగు యజ్ఞదత్తుని వద్దకు పోనున్న మరి యొక స్నేహితునితో, 'దేవదత్తుడు బ్రదికియున్నాడని యజ్ఞదత్తునికి చెప్పు' అని కోరును. ఆ నాలుగు మాటల భావమేమి?! యజ్ఞదత్తుడు దేవదత్తుని మరచిపోయినాడు; అది స్నేహధర్మముకాదు; దేవదత్తునికి యజ్ఞదత్తుని ప్రీతి ప్రియమైనది.'— ఇవియే, ఇటువంటివే, దేవదత్తుని ఇంగితములు. ఇవన్నియు-ఆ నాలుగు మాటలలో అణగికొని, బయటికి తొంగి చూచును. అట్లు బయటి చెవికి వినరాక, మనలో చెవికి మాత్రమే వినవచ్చు మర్మభావమే 'ధ్వని'.

## ధ్వని విచారము

ఎన్నియో మాటలకు విచిత్రమైన ధ్వనిస్వభావము వచ్చియుండును. అభినయ నిపుణుని కన్నులు, పెదవులు, తల, వ్రేళ్ళు-తామువేరుకాక తమ వంపు సొంపుల రీతితోనే వేరువేరు భావములను సూచించగలుగునట్లు, ఒకే విషయమును మనము చెప్ప ప్రారంభించి, అందుకై ఉపయోగించు మాటలను కొంత కొంత వ్యత్యాసముచేసి, ఉచ్చరించిన, చెప్పిన సంగతి అట్లే మిగిలినను. ఆ సంగతిని గురించి పుట్టిన మనోభావములు వేరువేరు కావచ్చును. ఒకటి రెండు దృష్టాంతములను చూతము.

| ఆహారము | మనోవికారము | మృతి |
|---|---|---|
| తినెను | బుద్ధి తారుమారయ్యెను | చచ్చెను. |
| భోజనముచేసెను | పిచ్చి పట్టెను | శరీరము త్యజించెను |
| కతికెను | చిత్రభ్రమ చెందెను | బాల్చీ తన్నివేసెను |
| పొట్టపోసికొనెను | పిత్తవికారము చెందెను | కాలధర్మము చెందెను. |
| కవళధ్వంసము చేసెను | బుద్ధి చెడెను | నూకలు చెల్లించుకొనెను |
| అన్నబ్రహ్మపూజచేసెను | ఉన్మాదవశుడయ్యెను | దేవుని పాదముల చేరెను |
| బువ్వ త్రాగెను | మనోరోగము తెచ్చుకొనెను | కీర్తిశేషుడయ్యెను |

విషయమొకటే అయినను దానిని చెప్పు మాటల రీతివల్ల ఆ విషయము నాలుగు వేరువేరు భావములను సూచింపవచ్చును. ఇట్లు ఒక పదము లేక ఒక పద సమూహము తాను స్పష్టముగా తెలుపు వాస్తవ సంగతితో పాటు గూఢముగ కలిగించు భావ వికారమే 'ధ్వని'.

ఎన్నియో పదములలో ఆయా పదములచే నిర్దిష్టములైన వస్తువు యొక్క స్వభావసూచనయును అణగికొని యుండును. ఇది సంస్కృతమున ఎక్కువ. ఆ పదరచనయే అట్లుండును. 'జగత్తు' అన్న మాటయందే 'చలించునది', 'మారునది' అను భావమణగియున్నది. 'ప్రపంచము'అన్నదానియందే 'ఒకదాని నుండి మరియొకటి పుట్టి వచ్చిన', 'చిన్నది పెద్దదై పరచుకొనిన' అన్న అభిప్రాయమడగియున్నది. ఇట్టి స్వంత ఆస్తి యున్న మాటల వల్లనే వాక్యమున కర్థపుష్టి. వానిదే ధ్వని శక్తి.

## వాసన

ఈ 'ధ్వని' యనునది కవిత్వతత్త్వ మీమాంసలో చాల పెద్దమాట. సామాన్యభాషలో 'ధ్వని' అన్నది చెవిద్వారా మనకు లభ్యమగు బహిఃప్రపంచపు టనుభవము. తత్సదృశ మగు అనుభవము కన్ను, ముక్కు మొదలగు ఇతరేంద్రియముల మూలకముగను కావచ్చును. శబ్దముచేత మన మనస్సుకు ఏ విషయము ప్రత్యక్షమైనదో, ఆ విషయము పరోక్షమునను న్న ఇంకొక విషయమును మనజ్ఞాపకమునకు తెచ్చునట్లు శబ్దప్రయోగము జరిగియుండిన, ఆ వాక్యశబ్దశక్తియే 'ధ్వని'. కావ్యశాస్త్ర పరిభాషలో ఆ 'ధ్వని' ఒకపదప్రయోగ చమత్కారము. నిఘంటువుతో ఒక మాటకు ఏర్పడిన అర్థము నిఘంటువులోలేని అర్థమొకదానిని దాని పోహింపును సూచించునట్లుండిన అప్పుడది ధ్వనివంతమగును. అట్టి అధికగుణమును వాసన అనియైనను పేర్కొనవచ్చును. ఛాయ అనియైనను పిలువవచ్చును. వీణను మీటి వ్రేలిని వెనుకకు తీసికొన్న తర్వాత కూడ తంతి కదలిక కనులకు కనబడకపోయినతరువాతకూడ దాని సూక్ష్మనాదము చెవికొక అర క్షణము వినవచ్చును. అది ధ్వని. దానిని పోలునట్టి కవి వాగ్గుణమే కావ్యజిజ్ఞాసలో పారిభాషిక 'ధ్వని'. ముత్యములను, వజ్రములను ఇంటిలోని పగటివెలుగులో చేతిలోనికి తీసికొని చూచినపుడు తెల్లగ కనిపించును. కాని అవి సుందరి ఆభరణములను చేరికొని దీపపు వెలుగులో ఆమె ముఖము కదలినట్లంతయు తళతళలాడినపుడు నీలము, పసుపు, ఎరుపు కాంతులను వెదజల్లును. అదియే లావణ్యము లేక ఛాయ. బట్టమీద

శ్రీగంధము, జవ్వాజి పడిన మరుసటిరోజు దాని
నుదికినను ఇంకను రెండుదినములు ఆ పరిమళము
దానికంటుకొనియుండుట కద్దు. ఆ సుగంధ విశే
షమే 'వాసన'. (ఉదా॥ జన్మాంతర వాసన.)

## రసము-ధ్వని

రసమన్నది హృదయద్రవము. ధ్వని దానికి కారణ
మయి ఉండవచ్చును; లేక దాని కార్యమును అయి
యుండవచ్చును. ఎవరో ఆడినమాటయొక్క ఒక
ముంటిమొన-దానిధ్వని-మనయెదను గ్రుచ్చి, కెర
లించి, ఉడుకెత్తించి, ఆ ఉడుకువలన ఆ యెద కరగు
నట్లు చేయవచ్చును. ఎద ఆట్లు నీరై తకతకలాడు
చున్నపుడు, దాని ఆవిరి ఒక ధ్యానబిందువై,
ధ్వనియై రూపొందవచ్చును. ఒకే హృదయవస్తువు
యొక్క ద్రవరూపము-రసము; అనిలరూపము-
ధ్వని. కొంతవాచ్యమును, కొంత సూచ్యమును,
బాహ్యసందర్భ వాచకమును, అంతర్భావ
సూచకమును, అయియున్న వాక్చమ
త్కారమే కావ్యము. ఆ చమత్కారపు పరి
ణామము జడమైన హృదయమును చురుకుపరచి,
ఊహాతరంగములను లేపునది కావచ్చును; లేక
అతిగా వేగపడి తల్లడించుచున్న హృదయ గమ
నమును ఆలోచనా స్తిమిత రూపమునకు పరివర్తించి,
శ్రేయోన్వేషణకు ప్రేరేపించునది కావచ్చును.

## సందర్భశక్తి

ధ్వని యన్నపేరు సూక్ష్మభావగర్భితమైన
వాక్ప్రయోగమునకు - ఇంగితార్థమున్న వచన
ప్రకారమునకు నియతమొనరించి కొనియుండుట
ఉచితమే. కాని అంతర్భావము వాక్కులో, వాక్య
శైలిలో అణగికొనియున్నట్లే ఒక వస్తువులో లేక
వస్తు సందర్భములో అడగియుండ వచ్చును. ఒక
మనుష్యు డాడిన మాటయొక్క ఒకానొక వ్యంగ్యము
వల్ల, ఒక వక్రితవల్ల, ఒకగుప్త మర్యాదవల్ల,
అతని హృదయపు టింగితము
విన్నవానికి ధ్వనితమై అతని మనస్సున
ప్రతిధ్వనిని లేపవచ్చును. కాని ఏకంఠస్వరమును
లేని, ఏ వాక్ప్రసక్తియును లేని సందర్భమునను
ప్రతిధ్వని జనకమైన లేక ప్రత్యుక్తిహేతువైన ఒక
శక్తి విశేషముండుట సాధ్యమగును. ఇటువంటిది.
వస్తుసంగతధ్వని లేక వస్తుజనిత చోదన. కవి
దృష్ట్యా అతని వాక్చాతుర్యము ముఖ్యమైన, కావ్య
సంస్కారము నపేక్షించు పాఠకుని దృష్ట్యా ముఖ్య
మయినది. అతని హృదయమునకు లభ్యమగు
చోదన కవి వాగ్విచక్షణవల్ల కలిగినను కవి
నిర్మించిన కథా సందర్భము వల్ల ఆ చోదన
కలిగినను ఒక్కటే. రామాయణములో రామ
చంద్రుడు దండకారణ్యమున సంచారము చేయు
నపుడు కమలమునో, కల్హారమునో, కన్నప్పుడం
తయు సీతాస్మరణ చేయును. ప్రత్యక్ష వస్తువులో
పరోక్ష వస్తువును స్మరణకు తెచ్చుకొనును.

కలహంసాలసయాన, నా మృగమదామో
దాస్య నిశ్వాస, నో
తలిరా, పంకజమా, మదాళికులమా, కల్హా
రమా, మత్తకో
కిలమా, కంటికి, పల్లవాధరను, అంభోజాస్య,
నా భృంగ కుం
తల, నాకైరవనేత్ర, నాపికరస ప్రఖ్యాత,
నా సీతనున్. (-నాగచంద్రుడు)

రామునికి చుట్టు పట్లగల ప్రకృతి దృశ్యమే
ఒక ప్రచోదన నొదవించినది. అందుకు రాము

డిచ్చిన ప్రతి చర్య యొక్క ఉత్తరమును ఈ పద్యము మనకు చూపును. అటువంటి అనుభవములు అందరు సహృదయులకును కలుగుచుండును. రవివర్మ చిత్రపటమున రమణీమణి కేశభారమును చూచినపుడంతయు ఒక రసికునికి అతని దివంగత ప్రేయసి తన తల వెంట్రుకలకు రాచుకొనుచున్న తైలపరిమళము ముక్కుకు వీచుకొని వచ్చినట్లగుచుండెనట:

ఉన్మీలన్మధుగంధలుబ్ధ మధుప వ్యాధూత చూతాంకురం
క్రీడత్కోకిల కాకలీ కలరవై రుద్గీర్ణ కర్ణ జ్వరాః
నీయంతే పథికైః కథం కథమసి ధ్యానావధానక్షణ
ప్రాప్త ప్రాణ సమా సమాగమ రసోల్లాసై రమీ వాసరాః॥ (జయదేవుడు)

తన యూరి నుండి ఏకాకిగా దారిన నడచుచున్న ప్రయాణికునికి వసంత కాలమున అటనట కనపించిన మామిడి తోపుల చిగుళ్ల, పూల, గుత్తులును, తుమ్మెదలును, కోకిలలును, ప్రియురాలితో తానేనాడో అనుభవించిన సంతోషమును జ్ఞాపకమునకు తెచ్చి, అతనిని సంతోష పెట్టినవట. ఇటువంటిది పరిసరాంతర్భూతధ్వని. అది అవాగ్ధ్వని, అదియే వస్తుధ్వని.

మహాభారత కథను చదివిన ఒక విమర్శకుడు కడపటికిట్లు ఫలశ్రుతి చెప్పినాడు :

స్తోక్తీర్ణా ఖలుపాంగవైః రణనదీ కైవర్తకే కేశవే ।

'కురుక్షేత్రమున ప్రవహించిన రక్తనదిలో చేపలు పట్టిన బెస్తవాడు కృష్ణుడు!'

ఎటువంటి మర్మభేదకమయిన టీక ఇది! దీనిని ప్రేరేపించినది భారతములోని మాటలు కావు; దాని కథా సందర్భము. గ్రీకుల రుద్రనాటకములందును, షేక్స్పియరు మ్యాక్బెత్ హామ్లెట్‌లలోను ఇటువంటి జీవవేధక సన్నివేశములు తామే తామై నిండుకొని యున్నవి. హంపీ క్షేత్ర పరిసరమున అట్టి శక్తికలదు. ఆ భగ్న రాజ భవనముల, శిథిల దేవాలయముల మధ్యనిలిచి, అటునిటు దృష్టి ప్రసారము చేసినపుడు,—'ఆహా! ఎటువంటి సాహసికులు! ఆ సాహసమెంతకు వచ్చినది! ఎట్లు కట్టినవి! ఎట్లు పగిలినవి!' అని ఎవరి కనిపించదు! అట్లనిపించుట విషయాంతర్గతధ్వని. ఆ చూపే చూచుచున్న వాని హృదయమును తాకి పొడుచును. మన కాలమున ఆటంబాంబు జపాను దేశములోని హిరోషిమా నాగసాకి పట్టణముల మీదవడి నాశనకార్యము చేసినది. మనము పత్రికలలో చదివినపుడు, ఆ వట్టి వార్త ఏ వాక్చమత్కృతియును లేకయే—మన మనస్సుల నేవిధముగా పొడిచి,చిద్రుపలు చిద్రుపలు చేసినది! అది సందర్భ ధ్వని. దానికి మాటల వసరము లేదు—లేక మాటల బలము చాలదు. గాంధీమహాత్ముడు ఏబది యేళ్లు స్వజనమునకు అభ్యుదయ మార్గమును చూపి, స్వాతంత్ర్యము సాధించి యిచ్చి, సాధు జీవనమున కాదర్శముగా బ్రదికి, తుదకు—

సబ్‌కో సన్మతి దే భగవాన్
(దేవుడా! అందరికిని సద్బుద్ధినిమ్ము)

అని మొరపెట్టుకొనవలసిన పరిస్థితిలో ధ్వని లేదా? అది శిక్షాధ్వని—వారి నుండి ఉపకారమును పొందిన వారి యోగ్యతను చూపించిపెట్టు హెచ్చరిక ధ్వని,-కరుణాధ్వని. ఇట్లు ప్రతియొక అసాధారణ మయిన వస్తు సన్నివేశమునందును కరుణా ప్రేరకమైన, ఆత్మశోధనకారకమైన, ఆశ్చర్యకారణమైన లేక సంతోష జనకమైన ప్రచోదన స్వతస్సిద్ధముగనుండును. కవి తన మితవాక్కు యొక్క నాజూకుతనము చేత మనకట్టి అనుభవ చోదనములను కలిగించినపుడది కావ్యధ్వని యగును,

# భారత ప్రధాని

# శ్రీ పి. వి. నరసింహారావు గారు

### శ్రీ వేమూరి ఆంజనేయశర్మ

ఆంధ్రదేశంలోనూ, ఇతర ప్రాంతాలలోనూ గూడా శ్రీ నరసింహారావు గారు పి. వి. అనే పేరుతో ప్రసిద్ధులు. వారు బహుభాషా విదులు. వారిని చూస్తుంటే మూర్తీభవించిన భారతీయ సంస్కృతి స్వరూపం కన్నులకు కట్టినట్లనిపిస్తుంటుంది. ప్రధానమంత్రిగా వారు ప్రమాణస్వీకారం చేసినప్పుడు, వారి మూర్తినీ,వారి దుస్తులనూ చూస్తే ఎంతో సంతోషం కలిగింది. ఖద్దరుధోవతీ, చొక్కా, ఆంధ్ర ఉత్తరీయం, నుదుట కుంకుమ బొట్టూ ధరించి వున్నారు. వారు హిందీలో ప్రమాణస్వీకారం చేశారు. వారి మాతృభాష తెలుగు. సహజంగా ఇంగ్లీషులో ప్రమాణస్వీకారం చేసినా సరిపోతుంది. కాని భారత జాతీయ భాష హిందీని గౌరవించడం తన ధర్మమని భావించి ఆ భాషలో ప్రమాణం స్వీకరించి తనభాషా ప్రేమను వెల్లడించారు. అదే వారి విశిష్టత. భారతీయ భాషలంటే ఆయనకు ఎంతో గౌరవం. ఎంతో ఆదరం. ఆ భాషలకన్నింటికీ మనదేశంలో ప్రముఖస్థానం లభించవలెననీ, అవి ఆయా రంగాలలో రాజకీయభాషలుగా ప్రధాన స్థానాన్ని వహించవలెననీ త్రికరణ శుద్ధిగా విశ్వసించి, అందుకై కృషిచేసిన, చేస్తున్న వ్యక్తి ఆయన. నిరాడంబరుడు, పరుషవాక్కులు ఎరగని వ్యక్తి. ఏ మిత్రుడు కన్పించినా హృదయం విప్పి ఆప్యాయతతో పలకరించి, ఆ మిత్రులు చెప్పినదానిని విని సలహాలిచ్చే స్వభావం ఆయనది. చాలాకాలం ఆయనకు అనుచరుడుగా, సహకార్యకర్తగా వుండి పనిచేశాను. పరుషవాక్యం ఆయన నోటివెంట నేనెన్నడూ వినలేదు. ఎదుటివారి అభిప్రాయాలను సానుభూతితో వినడం తనకు తోచిన సలహాలివ్వడం వారి ప్రత్యేకత.

సాహిత్యమంటే ఆయనకు ప్రాణం. శ్రీ పి.వి.ముఖ్యంగా సాహిత్యోపాసకుడు, తరువాతనే రాజకీయ వేత్త. అధునాతనమైన సాహిత్యప్రక్రియలన్నింటినీ క్షుణ్ణంగా అవగాహన చేసుకొన్న వ్యక్తి. రాష్ట్ర రాజకీయాలను వదలి పార్లమెంటుకు పోతానని ఒకసారి అన్నారు. ఎందుకు? అని నేనడిగాను. రాష్ట్ర రాజకీయాలలో సమయం దొరకడం లేదు, పార్లమెంటుకు పోతే సాహిత్యవ్యాసంగానికి సమయం దొరుకుతుందన్నారు. అయితే వారు చెప్పిన దానికి పూర్తిగా విరుద్ధంగా జరిగింది; పార్లమెంటు సభ్యులైన తరువాత ఆయనగారికి అసలే తీరికలేని పరిస్థితి ఏర్పడింది. ఎక్కడ మంచి పుస్తకం కన్పించినా దానిని వారు కొంటుంటారు. వారితో కలిసి ప్రయాణం చేసినప్పుడు ఎన్నో పుస్తకాలు కొనడం నేనెరుగుదును. కాని అవి చదవడానికి

సమయమేది? తీరికఏది? ఏ విమానంలోనో చదవ వలసిందేగాని క్షణం తీరిక లేనప్పుడు పుస్తకాలు చదివేదెక్కడ? వారు దక్షిణ భారత హిందీ ప్రచార సభ స్నాతకోత్తర విభాగానికి వైస్ ఛాన్సలర్‌గా నేను రిజిష్ట్రారుగా వుండేవారం. ఎన్నో సమస్యలు !! సలహాకై ఢిల్లీ వెళ్ళితే ఎజెండా ప్రకారం తక్కువకు తక్కువ సమయంలో సల హాలు తీసుకొనవలసి వచ్చేది. వారి సలహాతో, ప్రోత్సాహంతో కొత్త ప్రణాళికలనూ, కొత్త విధా నాల్నీ మేము అవలంబించాము. సాహిత్య ప్రధాన మైన ఎమ్. ఏ. పాఠ్యక్రమాన్ని భాషా ప్రధానమైన పాఠ్యక్రమంగా మేము అమలు చేయవలసి వచ్చింది. దానికి సంపూర్ణ సహకారం శ్రీ పి. వి. గారు అందించారు. ఈ కొత్త పాఠ్యక్రమాన్ని అంగీక రించడానికి మొదట మొదట యు. జి. సి. గూడా వెనకాడింది. ఆ పాఠ్యక్రమానికి రూపకల్పన చేయడంలోనూ, యు. జి. సి. చేత ఆ పాఠ్య క్రమాన్ని అంగీకరింప జేయడంలోనూ నరసింహా రావుగారు చేసినకృషి అద్వితీయమైనది. యు.జి.సి. అంగీకరించిన ఆ పాఠ్యక్రమాన్ని ఇతర విశ్వ విద్యాలయాలు అనుసరించడానికి తటపటాయిస్తుంటే దక్షిణ భారత హిందీ ప్రచార సభ తరఫున దానిని వారు సాహసం చేసి ప్రారంభించారు. హైదరాబాదులో పి. జి. కేంద్రం ప్రారంభించడానికి ఆంధ్ర ప్రభుత్వసహకారాన్ని సంపాదించి రిజిష్ట్రారు కార్యాలయాన్ని మద్రాసు నుండి హైదరాబాదుకు తరలించి ధైర్యంగా హైదరాబాదు కేంద్రంలో భాషా పాఠ్యక్రమాన్ని అమలు చేయించారు. ఆ కేంద్రస్థాపనకూ, కొత్తకొత్తగా రూపుదిద్దుకొన్న ఆ పాఠ్యక్రమనిర్వహణకూ వారు చేసిన కృషి ఇప్పటికీ నాకు కళ్ళకు కట్టినట్లు కన్పిస్తున్నది. మన దేశంలో విశ్వవిద్యాలయాలన్నీ భాషలకు సంబంధిం చిన ఎమ్. ఏ. కోర్సులను ఈనాడుగూడా సాహిత్య ప్రధానంగానే నడుపుతున్నవి. ఆ ఎమ్. ఏ. పట్ట భద్రులు ఉపాధ్యాయులుగా లెక్చరర్లుగా ఉపయో గిస్తారు గాని వివిధ ప్రభుత్వ కార్యకలాపాల నిర్వ హణకు అంతగా ఉపయోగించరు. ఫంక్షనల్ భాషలో గూడా ప్రావీణ్యం సంపాదిస్తేనేగాని సాహిత్యేతర విషయాలలో, రంగాలలో వారు రాణించరు. అందుకు తగినవారిని తయారుచేయడం భాషా ప్రధానమైన పాఠ్యక్రమ లక్ష్యం. హిందీ విషయంలో ఇది మరీ అవసరం. హిందీ మాతృ భాష గాని వారు భారత ప్రభుత్వానికి చెందిన వివిధరంగాలలో పనిజేయడానికి ఈ పాఠ్యక్రమం ఎంతైనా ఉపయోగిస్తుంది. శ్రీ నరసింహారావుగారు ఈ విషయాన్ని బాగా గుర్తించి హైదరాబాదులో ఆ పాఠ్యక్రమ ప్రారంభానికీ దాని నిర్వహణకూ బాలా సహాయం చేశారు. హిందీలో గూడా నర సింహారావుగారు నిపుణులు. వారు హిందీలో మాట్లా డుతుంటే హిందీ ప్రాంతాల వారు గూడా ముగ్ధులు గావడం నేనెరుగుదును. రాజస్థాన్‌లో, యు.పి.లో వారు పర్యటన జరిపారు. ఆ సందర్భంలో వారి వెంట వుండే అవకాశం నాకు లభించింది. విశ్వనాథ సత్యనారాయణ గారి వేయిపడగలు నవలను వారు హిందీలోకి అనువదించారు. దానికి భారత ప్రభుత్వపు బహుమతి లభించింది. సుప్రసిద్ధ హిందీ కవయిత్రి మహాదేవి వర్మగారికి జ్ఞానపీఠ బహుమతి ప్రదాన సందర్భంలో నరసింహారావు గారు ప్రధానోపన్యాసం చేశారు. హిందీ సభ వైస్ ఛాన్సలర్ ఎన్నిక సమితిలో కీ॥శే॥ ఉమాశంకర్ దీక్షిత్‌గారు శ్రీమతి ఇందిరా గాంధిగారి ప్రతి నిధిగా పాల్గొన్నారు. వారు శ్రీ నరసింహారావుగారి పేరును సమర్థిస్తూ జ్ఞానపీఠ్ బహుమతి ఉత్సవంలో నరసింహారావుగారు చేసిన ఉపన్యాసాన్ని ఎంత గానో కొనియాడారు. నరసింహారావుగారు మరాఠీ భాషలో గూడా నిష్ణాతులు. బహుభాషాకోవిదులు.

ఇక ఆచర్యానికి సంబంధించినంత వరకు శ్రీ నరసింహారావుగారు సిద్ధాంతవాది. ఆచర్యవాది. తాత్కాలిక ప్రయోజనాల కొరకై మిగతా చాలా మంది నాయకుల లాగా ఏ ఎండకు ఆ గొడుగు పట్టేతత్వం కాదు వారిది. శ్రీమతి ఇందిరా గాంధి గారు కొద్ది కాలం పదవిలో లేని సమయంలో, పదవిలో ఉన్నంతకాలం ఆమెను ప్రశంసించి పదవిలో లేనపుడు ఆమెను వదలి వెళ్ళిన వారినీ, పార్టీలు మార్చిన వారినీ ఢిల్లీలో చాలా మంది ప్రముఖులను నేనెరుగుదును. కాని పదవిలో వున్నా లేకపోయినా శ్రీ పి.వి. గారు శ్రీమతి ఇందిరాగాంధిని సమర్థించారు. ఆమెతోనే వున్నారు. నాకు తెలిసినంత వరకు ఆమె పదవిలో లేనపుడు గూడా ఆయన అరమరికలు లేకుండా ఆమెకు సంపూర్ణ సహకారాన్ని అందించారు. ఆమె పదవిలో లేనప్పుడే శ్రీ పి. వి. గారికి క్షణం తీరిక లభించేదిగాదు. మద్రాసులో హిందీ ప్రచార సభ కార్యవర్గ సమావేశానికి హాజరవుతున్న సమయంలో కూడా ఢిల్లీ నుండి సలహా కొరకై ఎడతెరిపి లేకుండా ఫోన్లు వస్తూ వుండేవి. సలహా లిస్తూ వుండేవారు. మంత్రిగా వున్నప్పటికంటే గూడా లేనపుడే వారు ఎక్కువ పనిచేసే వారు. ఇందిరా గాంధిగారు దక్షిణ భారత హిందీ ప్రచార సభకు అధ్యక్షురాలిగా ఎన్నుకోబడ్డారు. ఆమె అధ్యక్షురాలుగా వుండడంవలన ఆమె మంత్రి పదవిలో లేని రెండు సంవత్సరాలూ, కేంద్రంలో కొత్తప్రభుత్వం అమలులో వున్నంత కాలమూ హిందీ సభ గూడా చాలా కష్టాలు ఎదుర్కొన వలసి వచ్చింది. సభకు రాజకీయాలతో ప్రమేయ మేమీలేదు. అయినా బాధలు తప్పలేదు. రెండు సంవత్సరాలు గ్రాంట్లు ఆపివేయబడ్డవి. ఒక ఎంక్వైరీకమిటీ నియమించబడ్డది. పార్లమెంటు సభ్యురాలు శ్రీమతి జయాబహెన్ ఆ కమిటీకి అధ్యక్షురాలు. సభ అధ్యక్షురాలిని అనగా ఇందిరా గాంధిని మార్చమని సలహాలు లభించనవి. అధ్యక్షుణ్ణి సభలో ఎన్నుకొంటారు. ఎన్నికైనవారిని మధ్యలో మార్చడమెలా? అది న్యాయ సంగతమా? సభ అందుకు సిద్ధపడలేదు. ఆ స్థితిలో నరసింహారావు గారు సభకు అండగా వుండి సిద్ధాంతపరంగా దృఢవైఖరి అవలంబించే మనోధైర్యాన్ని మాకందరికి కలగజేశారు. చివరికి ఆనాటి విద్యాశాఖామాత్యులతో స్వయంగా మాట్లాడి సభకు రాజకీయ పార్టీలతో సంబంధంలేదనీ, రాజకీయాలతో సభ కార్యకలాపాలకు అడ్డంకులు కల్పించవద్దనీ నచ్చజెప్పగలిగారు. తరువాత స్థితి మారింది. ఇందిరా గాంధిగారు పదవిలోకి వచ్చారు. సారాంశమేమంటే శ్రీ పి. వి. గారు తాత్కాలిక ప్రయోజనాలకొరకై రాజీపడేస్వభావం కలవారు కారు. నాకొద్ది అనుభవంలో ఇటువంటి చాలా ఘటనల్ని నేనెరుగుదును. సిద్ధాంతం విషయాలలో ఆయన ఎంత పట్టుదల గలవారో మిగతా విషయాలలో అంత వినమ్రుడు. వినమ్రతలో ఆయన పరాకాష్ఠకు చెందిన వ్యక్తి. ఒక ఘటనను నేను మరచిపోలేను. నేను దక్షిణ భారతహిందీప్రచార సభకు మద్రాసులో ప్రధాన కార్యదర్శిగా ఉండేవాడ్ని. మా సభనియమావళి మారి ప్రథమ ఉపాధ్యక్షుడు, ద్వితీయ ఉపాధ్యక్షుడు అని రెండు పదవులు ఏర్పర్చబడ్డవి. సీనియారిటీ, అనుభవం, మొదలైన వాటి అన్నింటి దృష్టిలో శ్రీ నరసింహారావుగారు ప్రథమ ఉపాధ్యక్షులుగా ఎన్నికకావాలి. అదిన్యాయం. ఇంకొకవ్యక్తి ఆ పదవి తనకు కావలెనని కోరారు. పట్టుబట్టి ఎన్నికల తతంగానికి దిగారు. ఎంత చెప్పినా వినలేదు. నెమ్మదిగా విషయం శ్రీ నరసింహారావు గారికి తెలియజేశాను. మనస్సులో నాకు గూడా కష్టంగానే వున్నది. ఇదొక సమస్యా? ఆ వ్యక్తినే ప్రథమ ఉపాధ్యక్షులుగా ఎన్నుకోండి. వారిపేరును నేను ప్రతిపాదిస్తాను. నేను ద్వితీయ ఉపాధ్యక్షు

డుగా వుంటాను, అని నాతోఅని ఆయన స్వయంగా ఆరెండోవ్యక్తి గదికి వెళ్ళి మీపేరు నేనే ప్రతిపాదిస్తానని చెప్పారు. ప్రతిపాదించారు. నరసింహారావు గారు రెండో అధ్యక్షుడుగా ఎన్నికైనారు. జరిగిన దానికి మనస్సులో నాకు కష్టంగావున్నా నేను గూడా అంగీకరించక తప్పలేదు. ఎన్నికలు ఏక గ్రీవంగా జరిగిపోయాయి. అది ఆయన నమ్రత, అది ఆయన ఉదారత. ఆనాటినుండి నామనస్సులో వారియెడల గౌరవం ఆదరభావం అపారంగా పెరిగినవి. ఆ ఈ స్వభావం కారణంవల్లనే వారితో కలిసి పనిజేసిన వారెవ్వరూ వారిని వదల లేరు. తనతో పనిచేసిన చిన్నచిన్న వ్యక్తులను గూడా గౌరవించడం, వారికి తగిన సహాయం చేయడం ఆయనస్వభావం. ఆయన అజాతశత్రువు. కక్షసాధింపు తెలియనివ్యక్తి. గ్రూపులు సృష్టించడానికీ, కట్టడానికీ ఆయన ఎంతోదూరం. విలువల కొరకై శ్రమించే సహృదయుడు. నా అనుభవాలను తీరికగా ఎప్పుడో వేరే వివరంగా వ్రాయాలని ఉంది. ఆయన మహామేధావి. మంచి రచయిత స్నేహశీలి. ఒక్క విషయం ఉదహరించి ఈ చిన్ని వ్యాసాన్ని పూర్తి చేశాను.

శ్రీ పి. వి. నరసింహారావు గారు భారత ప్రధాని అయినారు. ఆయన ఆశించిన, అందుకై ప్రయత్నించిన పదవి గాదిది. పరిస్థితుల ప్రభావం వలన ఆ బాధ్యత శ్రీ పి. వి. గారి భుజస్కంధాల మీద పడింది. దేశం అల్లకల్లోలంగా వుండి భయంకరమైన ఆర్థిక సంక్షోభంలో వుండగా వారీ బాధ్యతను స్వీకరించారు. ఆ తరువాత జరుగుతున్న వ్యవహారాలలో చిక్కులూ, కష్టాలూ, రాజకీయాలూ ఎన్నివున్నా, మనశ్శాంతి లేని స్థితి ఏర్పడినా విలువలకు తిలోదకాలివ్వకుండా మైనారిటీలో వుండి గూడా ఇంతవరకు బండిని లాగి పెద్ద విపత్తునుండి తాత్కాలికంగానైనా దేశగౌరవాన్ని రక్షించారు. శ్రీ నరసింహారావుగారు విశ్వాస తీర్మానాన్ని పార్లమెంటులో ప్రవేశపెట్టారు. అద్వానీగారు ప్రతిపక్ష నాయకులు. వారిపార్టీ విశ్వాస తీర్మానాన్ని వ్యతిరేకించవలెనని నిశ్చయించింది. పార్లమెంటులో తన ఉపన్యాసాన్ని ప్రారంభిస్తూ శ్రీ అద్వానీ గారు నరసింహారావు గారు స్వాతంత్ర్యప్రాప్తికి పూర్వం కాంగ్రెస్ వాదులలో ఏ విలువలు వుండేవో ఆ విలువలను స్వాతంత్ర్యప్రాప్తి తరువాతగూడా నమ్మి అమలు చేయడానికి ప్రయత్నించే వ్యక్తి అని పార్లమెంటులో అన్నారు. విలువల విషయంలో అద్వానీగారి ఈ వాక్యం ఎంతైనా నిజం. ఆ వాక్యం నరసింహారావు గారి వ్యక్తిత్వాన్ని వివరించడానికి మచ్చుతునక అని నిస్సంశయంగా చెప్పవచ్చును.

# సందేశ కావ్యమాలలో మణిప్రవాళ 'మేఘసందేశం'

డి. నరేశ్ బాబు

దిశ్ ధాతువునకు 'సమ్' ఉపసర్గ చేరి సందేశ మనే శబ్దం ఏర్పడింది. 'అక్యాన సందిశ్యత' ఇది సందేశః అని దీని వ్యుత్పత్తి. ఒకరి చేత చెప్పబడు విషయము సందేశమని అర్థము. ఇంకో రకంగా చెప్పాలంటే అనేక కర్మణి వాక్యాల సముదాయం సందేశ కావ్యం అని చెప్పవచ్చు. సందేశ కావ్యాల్లో సామాన్యంగా నాయికా, నాయకుల సందేశం పంపడం గాని, స్వీకరించడం గాని జరుగుతుంది. సందేశ వాహకులుగ మేఘములు, శునకములు పవనములు, మరాళములు, పికములు, శుకములు మొదలగునవి ఉండును. వీనికి దూతలను నామాంతరము కలదు కాన, ఏతత్ప్రాధాన్య మీ కావ్యములందధికముగా కలదు. కాన వీనిని 'దూత కావ్యము' లనియు వ్యవహరింతురు.

మానవునిలోని రసాను భూతులను ఇతరులకు పంచి పెట్టడం అనే లక్షణానికి ప్రతిబింబమే సాహిత్య నిర్మాణం(1). ఇది కవిప్రతిభపై ఆధారపడి ఉంటుంది. సహృదయుడి హృదయాన్ని రసప్లావితం చేసి చిత్తద్రుతి కలిగించడానికి ఒక్కో కవిది ఒక్కో మార్గం. ఈ రకంగా 'మేఘసందేశ' మార్గాన్ని ఎన్నుకున్న కాళిదాసు మార్గం అనర్గళం, అనితర సాధ్యం. కాళిదాసుతో ఒక సంపూర్ణ రూపాన్ని సంతరించుకున్న ఈసందేశ లేదా దూత కావ్యాన్ని లాక్షణికులు 'ఖండ కావ్యాలు'గా గుర్తించారు. 'ఖండ కావ్యం భవత్కావ్యస్యైక దేశాను చారిచ' అని ఖండ కావ్య లక్షణం. మహాకావ్య లక్షణములలో ఏక దేశము (ఒక భాగము)ను గ్రహించి రచించిన అది ఖండ కావ్యమగును. దీనినే 'సంఘాతము' లేక 'సంఘాతకము' అనియు పిలుతురు. సందేశ కావ్యములందు విస్తృత కథ ఉండదు. సూక్ష్మేతి వృత్తం ఆధారంగా ఒక దూత నిర్వహించే దౌత్య కలాపాన్ని సందేశ కావ్యమని పేర్కొన వచ్చు.

## సందేశ కావ్య మందలి దూతలు

సామాన్యంగా వాగింద్రియ రహితములై ఉండుట గమనింపదగును. దీనిని భామహుడు 'అయుక్తిమత్' దోషముగా పరిగణించెను. అట్టి యిన కాళిదాసీ దోషమునకు పాల్పడెనా? అన్న కాదని కవికుల గురువే చెప్పుచున్నాడు. సందేశము సామాన్యముగ విరహార్తులగు నాయికా నాయకులకు

1. ఆధునిక సాహిత్యంలో దూత కావ్యాలు (Un-published thesis)

మధ్య జరుగునని చెప్పబడినది. విరహము కామ జనితము కామ ఏనగా కోరిక, అనగా ప్రకృత మున నాయికా నాయకుల సర్శాభిలాష యనిగాని, సంయోగాభిలాష యని గాని చెప్పవలెను. ఈ స్థితి యందుండు వారి మనఃస్థితిని కాళిదాసు 'కామార్తాహి ప్రకృతి కృపణాః చేతనాచేతనేషు' అని చెప్పెను. అనగా కామార్తులకు ఇది చేతనము, ఇది అచేతనము అన్న జ్ఞాన ముండదు. విరహార్తులయిన వారు, వారి కట్టెదుట నున్న దానినే గమనింప లేరనియు, అట్టి వారు వాగింద్రియ రహితములగు మేఘాదులచే సందేశము పంపుట ఔచిత్యమే యనియు కాళిదాసు హృదయము. అయినను ఇది దోషమే అని వాదించిన 'ఏ కోహి దోషో గుణ సన్నిపాతే నిమజ్జతీందోః కిరణేష్వివాంకః' అనున దున్నది గదా!

సందేశ కావ్య అవతరణ గురించి ఆలోచిస్తే ఇది కాళిదాసులో ఒక సంపూర్ణ స్వరూపాన్ని సంత రించుకున్నా దీని బీజాలు అనేక పూర్వ కావ్యాల్లో గోచరమౌతున్నాయి.

1. బౌద్ధ జాతక కథలలోని 'కామవిలాపం' అనే కథలో ఆర్తుడైన ఒక కాముకుడు చేతన మైన, జ్ఞాన లవ శూన్యమయిన వాయసమును తన ప్రాణప్రియ సమ్ముఖమునకు దూతగా పంపెను.
2. 'పర్ణి' అనే మానవ జాతితోను, ఫణులతోను 'సరమ' అనే శునకం రాయబారం జరపడం ఋగ్వేదమందలి దశమ మండలం లోని నవమ అనువాకంలో కనిపిస్తుంది. ఈ దివ్య శునకం ఇంద్రుని దూతికగా అభివర్ణింప బడింది.
3. సీతాన్వేషణ నిమిత్తమై రాముడు హనుమం తుని నియమింపగా, అన్వేషణా నంతరము సీతకు రామునికి మధ్య హనుమంతుడు దూతగా వ్యవహరించుట వాల్మీకి రామాయణ మందు కలదు.
4. మహాభారతేతిహాసంలోని 'నలోపాఖ్యానం'లో దిక్పాలకులకు దమయంతికి మధ్య, నల-దమయంతుల మధ్య మరాళము దూతగా వ్యవహరించును.
5. మేఘ సందేశానికి మూలం 'బ్రహ్మవైవర్త పురాణం'లో ఉందని ఇంద్రగంటి హనుమ చ్ఛాస్త్రి గారు చెప్పారు.
6. మేఘసందేశానికి మూలం ఎక్కడా లేదని కాళిదాసు జీవిత చరిత్ర దీనికి మూలమని ఒక నూతన వాదమును 'చరణతీర్థ మహ రాజ్' అను నతను ప్రతిపాదించెను.
7. దీనికి మూలము రామాయణమే నని 'సీతాం ప్రతి రామస్య హనుమత్సందేశం మనసి నిధాయ మేఘసందేశం కవిః కృతవా నిత్యాహుః' అని మల్లినాథ సూరి గారి నిష్కర్ష.

ఇవేగాక ప్రాచీన సాహిత్యంలో కృష్ణరాయ బారం, విదుర రాయబారం, సంజయ రాయబారం మొదలైనవి మేఘానికి మూలాలని విమర్శకుల అభిప్రాయం.

మేఘ సందేశమునకు పూర్వమెన్ని కావ్యము లందాధారములున్నను దీనికిది ఒక స్వతంత్ర కావ్యమే. విశిష్ట కావ్యమే. కాళిదాసు గ్రంథము లన్నియు ఒక ఎత్తు ఇది ఒక్కటి ఒక ఎత్తు. ఇట్లు చెప్పుటకు గల ప్రధాన కారణము ప్రక్రియా భేదము. కాళిదాసు మిగిలిన కావ్యములు అన్నియు ప్రాచీన ప్రక్రియలకు సంబంధించినవి. ఇది తప్ప వేరొకటి ఏది వ్రాసినను అది నాటకమో, కావ్యమో అయ్యెను తప్ప అన్యము కాలేదు. ఈ కావ్య నాటక

ములు రస ప్రధానములైనవి. ఇవి కాళిదాసుకు పూర్వము వచ్చినవి, అతని కాలమున వచ్చినవి. తదనంతర కాలమున వచ్చినవి. కాని వర్ణనా ప్రధానమైన ఖండకావ్యమునకు అద్వితీతడే. ఇదియే గాక ఇందు నాయక నామము, నాయిక నామము పేర్కొనబడలేదు. రసపోషణ జరగలేదు. అలం కార ప్రాధాన్యము కలదు. ఇన్ని నవ్య సంప్రదాయములకు ఆలవాలమెయ్యును అప్పటి కాలమున అది గొప్ప విజయము సాధించినది. నేటికిని అగ్ర స్థాన మున కలదు. ఇట్టి వైశిష్ట్యము గమనించియే ఒక రసికుడు

> కాళిదాస కవితా, నవం వయః
> మాహిషం దధి, సశర్కరం పయః ।
> ఐణ మాంస మబలాచ కోమలా
> సంభవన్తు మమ జన్మ జన్మని ॥

అని కోరుకొనెనంట.

మేఘసందేశమునకు ఋగ్వేదాది ప్రాచీన గ్రంథములందు ఆధారములున్నవని పరిశోధకులు నిర్ణయించినను అధికములగు సామ్యములు వాల్మీకి రచించిన రామాయణమందే గోచరించుచున్నవి. 'వ్యాసుడి కర్మాగారంలో సిద్ధంగా ఉన్న భాగాలను తీసికొని కాళిదాసు అభిజ్ఞాన శాకుంతలాన్ని నిర్మించాడు. అలాగే ఆయన మేఘదూతం కూడా అరణ్య, కిష్కింధ, సుందర కాండల్లో ఉన్న అలంకారాది సామగ్రితో కట్టిన కళాత్మక నిర్మాణమే'1. మేఘ సందేశ మందలి యక్షునకు, యక్షిణికి, మేఘము నకు రామాయణ మందలి శ్రీరామునకు, సీతకు హనుమంతునికి సామ్యములు గోచరించుచున్నవి. ఈ రకమైన సామ్యముల గురించి 'మేఘదూతకు రామాయణంతో ఉన్న సంబంధం' అనే వ్యాసంలో శ్రీ శేషేంద్ర శర్మ విస్తృతంగా చర్చించారు.

ఉదాహరణకు రాముడు హనుమంతునికి ఒక అంగుళీయ కాన్నే కాక 'కాకాసుర వృత్తాంతాన్ని' కూడా చెప్పి దూతగా పంపిస్తాడు. వస్తురూప అంగు ళీయకం పోవడానికి అవకాశముంది. కానీ వృత్తాన్త రూప కాకాసుర ఘట్టం పోవడానికి వీలులేదు. ఈ రహస్యం తెలిసిన కాళిదాసు యక్షుడు కేవలం రహస్య వృత్తాంతాన్నే సందేశంగా పంపిస్తాడు. ఇక్కడ స్వప్న వృత్తాన్తం రహస్య సందేశం. పూర్వం ఒక రాత్రి యక్ష యక్షిణులు నిద్రించు చుండగా యక్షిణి కల గనును. అందు యక్షుడు అన్య కాంతతో క్రీడించినట్లు చూచి రోదించుచు మేల్కొనును. యక్షుడిదేమని అనునయించుచు అడు గగా చివర కామె స్వప్నమును వివరించును. ఇది వీరి రహస్య వృత్తాన్తము.

ఇట్లే నాయికా నాయకుల మధ్య సామ్యత కాక సాంకర్యాలూ గమనింప వచ్చు. అందే నాయక లక్షణాలు కొన్ని నాయికకు ఆపాదింప బడతాయి. రామాయణంలో సీతా విరహంతో రాముడు మద్యమాంసాలు నిషేధించాడని చెబుతూ 'న మాంసం రాఘవో భుంక్తే న చాపి మధు సేవత' అని వాల్మీకి చెప్పగా ఈ లక్షణాన్ని కాళిదాసు యక్షిణికి ఆపాదింపజేస్తాడు.

కాళిదాసు రామాయణాన్ని అనుసరించడం అనౌచిత్యం కాదు. కానీ అవసరం లేనిచోట్ల కూడా అనుసరించాడని విమర్శకుల అభిప్రాయం-దీనికి ఉదాహరణగా 'రామాయణంలో హనుమంతుణ్ణి 'పిల్లి' అంతగా మారి వెళ్ళమనడంలో ఔచిత్యం

1. గుంటూరు శేషేంద్రశర్మ — కాలరేఖ (ఈ శతాబ్ది చివరన)
2. మేఘదూతకు రామాయణంతో ఉన్న సంబంధం... శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ
.... శ్రీమతి రాజకుమారి ఇందిరాదేవి ధనరాజ్ గిర్.

ఉంది కాని నాయిక దగ్గరకు వెళ్ళే మేఘాన్ని చిన్నగామారి వెళ్ళమని కాళిదాసు చెప్పడంలో ఔచిత్యమేమిట' ని విమర్శకులు ప్రశ్నించారు. యక్షుడు కామరూపి అని గుర్తుచేసి తద్వారా 'దూతను పొగడటం' అనే సందేశ కావ్య లక్షణానికి దోహదం చేయడమే ఇందులో ఔచిత్యం అని చెప్పవచ్చు. పై ఆధారాలు శేషేంద్ర శర్మగారు వారి వ్యాసంలో చెప్పినవే. వాటికి కేవలం వివరణ నాచేత ఇవ్వబడింది.

ఈ విధంగా రామాయణాన్ని పుణికి పుచ్చుకున్నది మేఘసందేశం. కథా వస్తువుగా తీసుకున్న వానిలోనే సామ్యమున్నది. దీనిని కాళిదాసు ఆదియందే సూచించెను. ప్రప్రథమ శ్లోకమందలి రామగిర్యాశ్రమము, జనక తనయా స్నాన పుణ్యోదకేషు మొదలగునవి దీనినే సూచించును. రెండింటను వియోగకాలము సంవత్సరమే'[1] యగుట గమనార్హము.

## దూత లక్షణాలు :

సందేశ కావ్యమందు దూతగా వ్యవహరించు దానికి కొన్ని లక్షణములు గలవు.

> ఉభయోర్భావ మున్నీయ స్వయం వదతి చోత్తరం ।
> సుశ్లిష్టం కురుత కార్యం నిసృష్టార్థస్తు సస్మృతః॥

అని దూత లక్షణములు. అనగా నాయికా నాయకుల భావములను తెలుసుకొని తనంత తానే ప్రత్యుత్తరమివ్వ గలిగినదై యుండవలెను. ఇట్టి క్లిష్టమైన కార్యమును నిర్వహింప గలిగినది నిసృష్టార్థమైన దూతగా వ్యవహరింప బడుచున్నది.

కాళిదాసు దూతకు ఈ లక్షణములు లేవని శంకింపరాదు. మరి యక్షునికి ప్రత్యుత్తర మీయలేదు గదా! యని శంకించిన అది దాన శీలత గలిగిన అతని గాంభీర్యమునకు చిహ్నమని తలంపవలెను. మేఘుడు చివరకు యక్ష సందేశము గొనిపోయి యక్షవధూ ప్రాణ రక్షణకై జనహిత ధ్వని కలవాడై దేవ రూపమును తెచ్చి దేవ వాక్కుతో ఆమెకు చెప్పెను. అది విని ఆమె సంతోషితాంతరంగయై యుండెను. ఇంతేగాక మేఘుని వలన మరి కొంత ప్రయోజనము కలిగినది.

> శ్రుత్వావార్తాం జలద కథితాం తాం ధనేశోఽపి సద్యః
> శాపస్యాఽన్తం సదయ హృదయః సన్నిధా యాస్త కోపః
> సంయోజ్యైతౌ విగళిత శుచౌ దంపతీహృష్ట చిత్తౌ
> భోగా నిష్టానభిమత సుఖాన్ ప్రాపయామాస భూయః

ఈ వార్త వినిన కుబేరుడును దయాంతఃకరణుడై తక్షణమే యక్షునికి శాపావసానమును గ్రహించెను. అంతియే గాక కాంక్షిత భోగముల కలుగ జేసెను. యక్ష యక్షిణుల కిన్ని ఉపకారములు చేసిన మేఘుడు నిస్సందేహముగ 'నిసృష్టార్థ' దూతయే అగును. కాళిదాసు తన దూతకు దైవత్వము నారోపించుట విశేషము. దీని వలన దూత కార్య నిర్వాహణా సామర్థ్యమందు ఆవంతయు శంకింప వలసిన అవసర ముండదు.

1. మేఘదూతకు రామాయణంలో ఉన్న సంబంధం ... శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ
2. ఆధునిక సాహిత్యంలో దూతకావ్యాలు (Un Published Thesis)

ఇట్లే ఒక్కే వృత్త (మందా క్రాంత) నిర్వహణము, దూతగా మేఘమును ఎన్నుకొనుట మొదలగు వానియందు ఔచిత్యమును పాటించెను.

సామాన్యముగ లోకమునందు లక్ష్యము నాధారముగ జేసికొని లక్షణము వచ్చుట జరుగును. దీనియందును అట్లే జరిగినది. సందేశ కావ్య లక్షణములు మేఘ సందేశము నాధారముగా చేసికొనియే జనించినవి. కాని లక్ష్యము నాధారముగా గొని ఏర్పడిన లక్షణములు తిరిగి ఆ లక్ష్యమునకు అన్వయించునా, లేదా యని పరిశీలించుట దోషము కాక పోవును. సందేశ కావ్యములలో

1. ఆర్తి
2. ఎన్నిక
3. అర్థింపు
4. సందేశము
5. వీడ్కోలు[1]

అను అంశములు ప్రధానముగా నుండును. సామాన్యముగ ఆర్తి విరహ జనితము. ఇది 'వ్యథ' వలనను జనింపవచ్చును. దూత దర్శనము వలన నాయకునకు పూర్వస్మృతి కలిగి ప్రియురాలితో గడపిన మధుర క్షణములు 'తలపు'నకు వచ్చును.

యక్షుడు మేఘ గమనానంతరము యక్షాంగనను తలచుకొని అంతర్మథను డగును. ఉత్తర మేఘమందలి అనేక భాగములు యక్షుని తలపులతోనే గడచును.

అనంతరము నాయకుడు దూతను ఎన్నుకొనుట జరుగును-ఇందు దూత కొరకు ఎదురు చూచుట, లేదా అప్రయత్నముగ లభించిన దూతను ఎన్నుకొనుట అన్న రెండంశము లుండును. యక్షునికి లభించిన దూత అప్రయత్నకమైనది. అనంతరము దూతను గుర్తించి, ఆహ్వానించి పొగడుట ఉండును.

ప్రత్యాసన్నే నభసి దయితా జీవితాలమ్బనార్థీ
జీమూతస్య స్వకుశల మయీం హారయిష్యన్ప్రవృత్తిమ్
సప్రత్యగ్రైః కుటజ కుసుమైః కల్పితార్ఘాయ తస్మై
ప్రీతః ప్రీతి ప్రముఖ వచనం స్వాగతం వ్యాజహార.

అను శ్లోకమందు దూతాగమన గుర్తింపు, ఆహ్వానము కలవు. జాతం మన్యే.... ఇత్యాది వంశ వర్ణన వలన 'పొగడుట' అను లక్షణము వ్యక్తమగు చున్నది.

మూడవది సందేశము అందింపుమని ప్రార్థించుట. ఇందు కొన్ని యెడల ప్రతివచనము తెమ్మనియు అర్థింపు ఉండును. మేఘసందేశ మందీ ఆవశ్యకత కలుగలేదు. సందేశ మందింపు మను అర్థింపు మాత్రము కలదు. ఉత్తర మేఘమున "కచ్చిత్సౌమ్య వ్యవసిత మిదం బన్ధుకృత్యం . . . ఇత్యాది శ్లోకములందు "నాకొఱకీ బంధు కార్యమంగీకరించుము. అను 'అర్థింపు' గోచరించును. ఈ అర్థింపునకు దూత 'అభయహస్త' మియ్యవలెను. ఈ కావ్యమందు దూత వాగింద్రియ రహితుడగుట వలన మౌనముగా నుండుట భూరిదాతయగు అతనికి తగిన లక్షణమని సమర్థింప బడినది.

'సందేశ'మందు నాయిక పరిస్థితి, నాయక క్షేమవార్త, నాయిక పరిస్థితి గురించి బాహ్యా వ్యక్తీకరణ మొదలగునవి ఉండును. సందేశము పంపు వారిని బట్టి ఈ లక్షణములు నాయికా నాయకు లందు వ్యత్యస్తము లగుచుండును. ఉత్తర మేఘ మందు నాయిక పరిస్థితి గురించి "ఆలోకేతే నిపతతి పురా - - " ఇత్యాది శ్లోకమందు విరహము వలన

1. ఆధునిక సాహిత్యంలో దూతకావ్యాలు (Un-Published Thesis)

కృశించిన నా ప్రేయసి నా స్వరూపమును చిత్రించు చుండును. లేదా! పంజరగత పక్షి వంక దృష్టి సారించి "ఓ రసజ్ఞులారా! నీవు మనస్వామిని తలంతువు గదా! ఏల తలంప వలయునన్న ఆయనకు నీపై ప్రేమ గదా! అని అడుగుచుండును" అని నాయికా పరిస్థితి వ్యక్తీకరింపబడినది. తన్వీశ్యామా! శిఖరి దశనా పక్వబింబాధరోష్ఠీ... ఇత్యాది నాయికా రూపవర్ణనచే సందేశము పూర్తి అయినది.

అనంతరము 'మార్గనిర్దేశము' చేయుట జరుగును. ఇందు స్థల, స్థలపురాణ, స్థల పూర్వ వైభవ వర్ణన, వాని చారిత్రకాంశములు ఉండును. "మార్గం తావచ్ఛృణు కథయత . ." అను శ్లోకమునుండి రమణీయమగు,లోకోత్తరమగు మార్గ నిర్దేశ మీ కావ్యమందు చేయబడినది. అనంతరము ఇంటిగుర్తులు చెప్పుచు 'తత్రాగారం ధనపతి గృహా నుత్తరే ణాస్మదీయం-ఇత్యాది శ్లోకమున తన ఇంటి ముందు బాల మందార వృక్షము కలదని చెప్పును.

చివరిది 'వీడ్కోలు' ఇందు దూతకు జాగ్రత్తలు చెప్పుట, సాగనంపుట, తిరిగి రమ్మనుట, తాను ఎదురు చూచు చుందునని చెప్పుట, సందేశమును చెప్పు విధానమును బోధించుట, శుభశకునములు గుర్తించుట మొదలగునవుండును. మన్దం మన్దం నుదతి పవనో-ఇత్యాది శ్లోకమందు శుభశకునములుగా గాలి అనుకూలముగా, మెల్లగా వీచుట, వానకోకిల గర్వించి మధురముగ కూయుట, జగ్గురులు మేఘమును గర్భాధాన నిమిత్తము ఆశ్రయించుట మొదలగునవిగా చెప్పబడెను. ఇందు 'దూత' తిరిగి వచ్చు వరకు యక్షుడు నిరీక్షింప వలసిన అగత్యము లేదు. యక్ష సందేశ మందిన వెంటనే శాపవిముక్తి కలుగును.

ఈ రకంగా దూత కావ్య లక్షణములు సర్వసమగ్రముగ మేఘ సందేశమునకు సరిపడుచున్నవి రామాయణంలో మొగ్గగా ఉన్న సందేశ కావ్య స్వరూపాన్ని విచ్చిన పువ్వులా చేసి దానికో పూర్ణ రూపాన్ని ప్రసాదించినవాడు కాళిదాసు. వికసించిన పుష్పము పరిమళములు వెదజల్లుట సహజము. అట్లు పరివ్యాప్తములయిన ఆ పరిమళములను ఆస్వాదించు రసికులు అప్పుడు సర్వే సర్వత్ర కలరు. దీని ప్రభావమే పవనదూతం, మొదలైన కావ్యాల జననం. ఇదేగాక హంస సందేశం, ఉద్ధవ దూతం, కోకిల సందేశం, శుక సందేశం, ఇందు దూతం, పదాంగ దూతం, మానస సందేశం, చంద్రదూతం, భృంగ సందేశం, తులసీదూతం, యక్ష సందేశం, వాయు దూతం, నేమి దూతం, మొదలైన కావ్యాలు దీని ప్రభావంలోనే ప్రభవించాయి. వీటిలో వేదాంత దేశికుల హంస సందేశం విశిష్ట కావ్యం.

కాళిదాస కావ్య పుష్ప పరిమళం ఆధునిక కాలం వరకు వ్యాపించడం దాని నిత్య నూతనత్వాన్ని తెలియ పరుస్తున్నది. గబ్బిలం, శశిదూతం, మొదలైనవి ఇందుకు ఉదాహరణ అవుతాయి.

దీనివల్లనే 'అలంకారం' అనే లక్షణం ఆలంకారికుల గ్రంథాల్లో చోటుచేసుకున్నదని శ్రీ శేషేంద్ర తెలిపారు.(1) ఈ రకంగా సాహిత్య గ్రంథాలకు ప్రేరకం గావడమే గాక, లాక్షణిక గ్రంథాలలో కూడా గణనీయమైన మార్పు తీసికొని వచ్చిన 'మేఘసందేశం' నేటికీ తన గురుగౌరవాన్ని నిలుపుకుంటూనే ఉంది. 'నవ నవోన్మేషశాలినీ ప్రజ్ఞా ప్రతిభా' అన్న వాక్యానికి చక్కని ఉదాహరణ 'మేఘసందేశ' కావ్యం.

1 కాలరేఖ (ఈ దశాబ్ది చింతన)

# పంచవ

మూలం :
మైథిలీ శరణ్ గుప్త

అనువాదం :
ఈమని దయానంద

[రసజ్ఞులైన పాఠకులతో బాటు సాహిత్యోపాసకుల, ప్రయోజనాన్ని దృష్టిలో ఉంచుకొని 'పంచవటి' ఖండ కావ్యానువాదం ధారావాహికంగా ప్రచురిస్తున్నాం. పాఠకులు తమ సూచన లందించగలరు.]

— సంపాదకులు

చారుచంద్ర కిరణమ్ములు
చంచలగతి క్రీడించగ
నిర్మలమౌ తెలి వెన్నెల
నింగి నేల ప్రసరించగ

మొలకెత్తిన తృణాగ్రములు
తెలుపు నవని పులకింతలు
చిరుగాలికి తలలూచెడు
తరువులు తమ గిలిగింతలు.

పంచవటచ్ఛాయల ని
ర్మించబడెను పర్ణశాల
దానిముందు స్వచ్ఛశిలా
తల్పముపై మౌనిలీల
జాగృతుడై యుండె నెవడు ?
జగ మంతయు నిద్రింపగ
భోగియైన కుసుమాస్త్రుడు
యోగియయ్యె నేమొయనగ.

ఏమి వ్రత మ్మాచరింప
నెంచెనొ యీ వనవిహారి ?

నిద్రా దేవతను గూడ
నిర్జించిన ధనుర్ధారి.

యోగ్యుడయ్యు రాజభోగ
భాగ్యమ్ముల ననుభవింప
విరక్తుడై నేడెందుకు
విపిన మందు కూర్చొనెనో?

కుటీరమం దేమి ధనము
గుప్తముగా దాచబడెనొ?
రక్షకుడై నిలచెను క్రమ
శిక్షణ గల భటుని వోలె

మర్త్యలోక మాలిన్యము
మార్జింపగ మగని వెంట
చనుదెంచిన లక్ష్మి పర్ణ
శాలనే వరించె నంట

వీరవంశ గౌరవమును
విస్తరించు యోధుడయ్యు
నిర్జన వనమం దీతడు
నిశాచరుల మాయగనడు.

# గాంధీః

— శంకరగంటి రమాకాంత్

కత్తిని పట్టకన్ రిపుజగత్తును చిత్తొనరించు వానికిన్,
చిత్తము పూవు మాదిరి విచిత్రము గా మృదువైన వానికిన్,
నిత్తెము రామనామమును నెమ్మనమందు జపించు వానికిన్,
ఉత్తముడైన గాంధికి, మహోన్నతమూర్తికి అంజలించెదన్

హాలహలమ్ము కక్కెడి మహోహుల కోరల నుండి స్వేచ్ఛమా
పాలను పిండజాలిన అపార తపోబల మున్న వానికిన్,
తాలిమి తోడ శత్రువుల దర్ప మడంచెడు నేర్పువానికిన్,
పోలికలేని శ్రీ పుతలి పుత్రవరేణ్యున కంజలించెదన్.

సత్యము తప్ప అన్యపదజాలము నోటికి రాని వానికిన్,
మృత్యువటన్న భీతి లవలేశము నైతము లేనివానికిన్,
సత్యపుటాగ్రహమ్మనెడు చక్కని పంథకు మార్గదర్శికిన్,
ఆత్యకలంక వర్తనున కంజలి చేసెద గాంధి తాతకున్.

భారత దేశ దాస్యమును బాపగ కష్టములోర్చి ఎన్నియో
మారులు జైళ్ళకున్ వెడలి క్రమ్మగినవానికి, శాంతికున్న ఆ
సారతరప్రభావమును చాటిన వానికి, శ్రీ సబర్మతీ
తీరవనీమునీంద్రునకు, దివ్యచరిత్రున కంజలించెదన్.

మాదిగ మాలలన్ పిలిచి మాసరివార లటంచు పల్కుచున్
సోదరతుల్య భావమున చూచిన వానికి, జీవితమ్మునన్
చేదునుమెక్కి స్వాద్యమృత శీకరముల్ వెదజల్లువానికిన్,
మాదు హితైషిగాంధికి, హిమాద్రి సమానున కంజలించెదన్.

పేరుకు ప్రాకులాడని నవీన మహర్షికి, జీవితాన గీ
తా రసబోధ దారిని సదా పయనించిన బాటసారికిన్,
వైరము దూరమైన పసిబాలుని బోలిన వానికన్, అహిం
సా రణ కర్ణధారికి నమస్సులు సల్పెద గాంధి గారికిన్.

# మన పి.వి.

జి. శ్రీశైలం

ఓర్పు కలిగిన నిజాయితీపరుడు
ప్రధానమంత్రిగ తీర్పును
అందుకున్న ఘనుడు
కవిగా రచయితగా ప్రసిద్ధుడు
భరతజాతికే అలంకార భాసితుడు
తెలుగువాడిగా
బహుభాషా పరిజ్ఞానిగా
విశ్వ విపంచిని మీటు భావుకుడు
దశదిశలా సంస్కృతీ
బీజాలునాటు కళాకోవిదుడు.

గుజరాతికథ

# మధుర సంబంధం


రచయిత
శ్రీ అనూప్‌సింహ్ పరమార్

అనువాదం
శ్రీమతి ఆర్. జ్యోత్స్న


కథారచయిత అనూప్ సింహ్ పరమార్. ఈయన జననం 1924లో గుజరాత్‌లోని సూరత్ జిల్లాలో. మెట్రిక్యులేషన్, మరియు రాష్ట్రభాషా కోవిద్‌లో ఉత్తీర్ణులు. వ్యవసాయం ఈయన వృత్తి. దాదాపు 125 కథలు పత్రికలలో ప్రచురింపబడ్డాయి. అనేక బహుమతులు గెలుచుకొన్నారు. ఈయన కథలలో ఎక్కువగా సూరత్ జిల్లాలోని దక్షిణప్రాంతంలోని ఆదివాసుల ఆచార వ్యవహారాల చిత్రణ వుంటుంది. 500 దాకా కవితలు, 100 బాల సాహిత్యం ఈయన రచనలు.

అప్పుడప్పుడు చిన్నచిన్న విషయాలు పెద్దవై అనవసరమైన పెద్దపెద్ద తగాదాలకు కారణమవుతుంటవి. ఒక సంవత్సరం క్రితం మా బావగారు మేమూ వేరుపడ్డాము. మా ఇంట్లో వాతావరణం ఎంతో శాంతంగా వుండేది. పంపిణీలు జరిగినప్పుడు గూడా ఏ విషయమూ రెండోకంటివాడికి తెలియకుండా జరిగిపోయింది. ఎవ్వరికీ ఎటువంటి మనస్తాపమూ, అసంతృప్తి కలగలేదు. ఎటువంటి తగాదాలూ జరగలేదు. భూమిపంపిణీ జరిగినప్పుడు గూడా మాబావగారు తన పెద్దతనాన్ని గూడా చూపించకుండా న్యాయబద్ధంగా వ్యవహరించారు. గ్రామంలోని వారంతా అన్నదమ్ములపంపిణీ అంటే అట్లా వుండాలని సంతోషించారు. ఈ మధ్య ఒక చిన్న పని జరిగింది. మాయింటి ఎదుట సింహద్వారం పక్కనే ఒక అరుగున్నది. అది సగం మాకు వచ్చింది. సగం బావగారి భాగంలోకి పోయింది. నేను ఆ అరుగును పేడతో అలికాను. రెండంగుళాలు నావేళ్ళు వారిభాగం అరుగుమీదకు పోయినవి. అది మా బావగారి భార్య నాపెద్ద తోడికోడలు చూచింది. భాగంలో నీకొచ్చిన చోటు నీకు సరిపోవడం లేదా ? మా భాగానికి వస్తున్నావు అన్నది. అది వినగానే నాకూ కోపం వచ్చింది. రెండంగుళాలు అలుకుడు మీభాగంలోకి వస్తే ఏం ప్రమాదం వచ్చింది. అసలు నీమనస్సులో ఏమి ఉక్రోషం వున్నదో చెప్పు అన్నాను నేను. ఆ రెండంగుళాల మేర అలుకుడు తుడిచివేశాను కాని నా మనస్సులో ఏర్పడ్డ కోపం తగ్గడం లేదు. బయటికి రావలెనని ఉరకలు వేస్తున్నది. బావగారికి ఈ విషయం తెలిసి మా తోడికోడల్ని బాగా మందలించారు. నాభర్త కళ్లురిమి నన్ను బాగా చీవాట్లు పెట్టారు. మాబావగారే తనతమ్ముణ్ణి శాంతింపజేశారు. ఆడవాళ్ళంతే. చిన్నచిన్నవాటిని పెద్దవి చేస్తుంటారు. నెమ్మదిగా వాళ్లే సర్దుకొంటారని మా వారిని శాంత పరిచారు.

అంతటితో రుద్రరూపం దాల్చవలసిన తగాదా సమసి పోయింది. కాని మా మధ్య మాటలు ఆగిపోయాయి. ఒకరినీడను చూస్తే ఇంకొకరం తొలగిపోవడం ఆరంభించాము. ఈ జీవితంలో మాకు మాటలు లేవు, ఉండకూడదని ఇద్దరం మనస్సులో నిర్ణయించుకొన్నాము. అయితే ఈ నిర్ణయానికి శిక్ష పిల్లలకు పడింది. మాపిల్లలిద్దరూ పెద్దమ్మ పెద్దమ్మ అంటూ రోజంతా పెద్దామె దగ్గరే వుండేవాళ్ళు. మా పిల్లలు భోజనాల సమయానికి పళ్ళేములు పెట్టుకొని ఆమెదగ్గరే వంటింట్లో కూర్చునేవాళ్ళు. వాళ్లింటికి పోగూడదని మాపిల్లల్ని నేను కట్టడిచేశాను. ఆమె గూడా అంతే చేసివుంటుంది. కాని పిల్లలు ఆగరే ! వాళ్ళను ఆపె దెట్లా ? పిల్లు పెద్దమ్మ పెద్దమ్మ అని

గదిలో కూర్చుని స్మరణచేస్తూ వుండేవాళ్ళు నేను ఎంత కళ్లురిమి చూచినా ఆగేవాళ్ళుకారు. మా వాళ్ళ కంటే ఆమె పిల్లలు పెద్దవాళ్లు. ఊహ తెలిసినవాళ్ళు. పెద్దమ్మాయి సీత. రెండోవాడు మనోజ్. వాళ్ళు నాపేరు ఎత్తేవాళ్ళు కారు. కాని మా పిల్లలు ఊహ తెలియనివాళ్ళు. రాకేష్, ముఖేష్‌లు. ఇదంతా చూచి నేను కొంత మెత్తబడ్డాను. సీత మనోజ్‌లు కిటికీ దగ్గరికి వచ్చి మా పిల్లలిద్దర్నీ సైగచేసి పిలిచేవాళ్లు. మావాళ్ళు అదిచూచి మెల్లగా వాళ్ళింట్లోకి జారుకునే వారు. నేను బాగా మెత్తబడ్డాను మావారు గూడా నాకు బాగా నచ్చజెప్పారు. రాకేష్ ముఖేష్‌లు మొదటిలాగానే పెద్దమ్మదగ్గర చేరడం మొదలు బెట్టారు. వంటయింట్లోకి గూడా చేరారు.

నాలోగూడా కొంతమార్పు వచ్చింది. పెద్దామె కనబడితే ముఖం తిప్పుకునేదాన్ని. ఇప్పుడామె వంక చూడడం ఆరంభించాను. కాని మాటలు కలిసేవి గావు. ఆమె తప్పులు నాకు జ్ఞాపకం వస్తే నా తప్పులు ఆమెకు జ్ఞాపకంవచ్చేవి. సీత మనోజ్ లిద్దరూ మాయింటికి రావడం ప్రారంభించారు. ముఖేష్ వయస్సు ఐదు సంవత్సరాలు. రాకేష్ వయస్సు మూడు సంవత్సరాలు. రాకేష్ సీత వొడిలోగాని కూర్చోడు. సీత చాలా మాటకారి. పిన్నీ! రాకేష్ నాదగ్గరేవుంటాడు. నీదగ్గరికి రాడు అంటుండేది. నా దగ్గరకు బాగా వచ్చేది. బావగా రంటే పిల్లలందరికీ బాగా చనువు. ఆయన రెండు మూడు రోజులకు ఏ ఊరో పోతూవుండేవారు. బస్సు మా వాకిట్లోనుండే పోతుండేది. ఆ తరువాత నెమ్మదినెమ్మదిగా పెద్దామెతో నాకు మాటలుగూడా ప్రారంభమైనవి.

ఒకరోజు ఆమె తన పుట్టింటికి ప్రయాణ మయింది. ముఖేష్‌కు తెలిసింది. ఎక్కడకు పోతావు పెద్దమ్మా? అని అడిగాడు.' మామయింటికి అని ఆమె జవాబు చెప్పింది. నీవు గూడా వస్తావా? అని అడిగింది. వాడు ఎగిరి గంతేశాడు సీత ముఖేష్ గూడా అమ్మతో వెళ్తాడు అని నిర్ధారణ చేసి పారేసింది ముఖేష్ నాదగ్గరకు వచ్చి-అమ్మా! నేను పెద్దమ్మతో వెళ్ళుతాను. గుడ్డలు ఇవ్వు. మేజోళ్లు చెప్పులు ఇవ్వు అన్నాడు.

ఇప్పుడే వెళ్లుతున్నావా? అన్నాను నేను సీత పరుగెత్తుకుంటూ వచ్చింది. ముఖేష్ మా అమ్మతో గూడా వెళ్లుతున్నాడు, వాడికి గుడ్డలివ్వమన్నది.

ఆలోచన అనే పెద్దమేఘం నా చుట్టూ అవ రించింది. ముఖేష్ తొందరపడుతున్నాడు. 'అమ్మా! పెట్టె తెరిచి ఆ చారల బుష్‌కోటు ఇవ్వ' మంటున్నాడు. వాడు నా వశంలో లేనట్లు పెట్టె తెరిచాను. ముఖేష్‌కు గుడ్డలు తొడిగాను. సీత అమ్మకు కబురు చెప్పడానికి వెళ్లింది. తిరిగి వచ్చింది. ముఖేష్ తలదువ్వింది. వాడి కళ్లకు కాటుక పెట్టింది. ముఖానికి పౌడరు రాసింది. ఆ పనులు చేస్తూనే—ముఖేష్ ఎంత బాగున్నాడు!! అని వాడి బుగ్గ ముద్దు బెట్టుకొన్నది.

నా మేజోళ్లు, చెప్పులు అని ముఖేష్ గంతులు వేస్తున్నాడు. బస్సువస్తుంది. పెద్దమ్మ తయారుగా వున్నది అన్నాడు.

ఇంతలో పెద్దామె కంఠధ్వని వినిపించింది— ముఖూ! వస్తున్నావా? తొందరగా రా అన్నది. 'ఉండమ్మా! చెప్పులు తొడిగి తీసుకొస్తున్నా' అన్నది సీత. కాని ముఖూ చెప్పులు కనబడటంలేదు. పిన్ని ఎక్కడబెట్టి మరచిపోయిందో!!

దరిద్రుడు ఎక్కడో పారేస్తాడు నా ప్రాణం తీస్తాడు అన్నాను నేను. 'దరిద్రుడు గిరిద్రుడు అనకు, చెప్పులు ఎక్కడోవుంటవి. వెదకాలి'అన్నది సీత.

ఎంత వెదకినా చెప్పులు కనబడలేదు. ఈసారి పోదువుగాని అని నేనెంత జెప్పినావాడు వినడంలేదు.

చెప్పులు లేకుండానే వెళ్లవమ్మ అన్నది సీత. ఇంతలో బస్సు వస్తూ కనబడింది. అమ్మా చెప్పులు పెట్టె కింద వున్న వేమో చూడు అంటున్నాడు ముఖేష్ సీత గూడా చెప్పుల కొరకై వెదకడమారంభించింది. పెద్దామె ఇంట్లోకి రానేవచ్చింది. పెద్దగా "కంచన్! నీపనులన్నీ ఇట్లానే వుంటవి. వస్తువులు జాగ్రత్తగా పెట్టుకోవద్దూ!!" అంటూ ముఖేష్‌ను చేతితో పట్టు కొన్నది 'నాన్నా! పద నేను నీకు కొత్త చెప్పులు కొంటాలే. మీ అమ్మ అంతే' అంటూ ముఖాను బస్సు దగ్గరికి తీసుకొని పోయింది. తొందరలో ముఖేష్‌కు ఇవ్వవలసిన డబ్బులు నా చేతిలోనే వుండి పోయినవి. అయినా— ఆ ఒక్క మధురక్షణంలో నా కళ్ళు చెమ్మగిల్లి పోయినవి. సీత నా పక్కనే వున్నది ఆ సంగతి గూడా నేను మరిచిపోయాను. పద నాన్నా! అన్న పెద్దామె మాటలు నా చెవుల్లో ప్రతిధ్వనిస్తూ వుండిపోయినవి.

# మనవి

స్రవంతి మాసపత్రిక వార్షిక చందాలను పోస్టుద్వారా పంపించ దలచుకున్నవారు సంపాదకుని చిరునామాకు పంపవలెను. గడువు తీరు నెల పత్రికపై వ్రాసి ఉంటుంది. అది గమనించి వెంటనే చందా పంపకోరుచున్నాము.

91 ఆగస్టు నుండి సంవత్సరపు చందా 20/-రూ॥

విడిప్రతి 2/-రూ॥

సంపాదకులు

పంజాబీ కథ:

# సొంత వూరు

రచయిత

**రామ్ సరూప్ అణఖీ**

అనువాదం

**ఆర్. జోత్స్న**

అణఖీ పంజాబ్‌లోని సింగరూర్ జిల్లా ధౌలా గ్రామ నివాసి. పంజాబీలో ఎమ్.ఏ. పట్టభద్రుడు. గ్రామజీవితచిత్రణ ఈయన కథావస్తువు. 7 నవలలూ, 10 కథాసంగ్రహాలూ, 3 కావ్యాలూ ఈయన రచనలు. ఈయన పలు రచనలు హిందీ, గుజరాతీ, ఇంగ్లీషు భాషలలోకి అనువదించబడ్డవి. [ప్రఖ్యాత పంజాబీ రచయిత.]

రండిబాబూ! రండి—నాలుగు రూపాయలు నాలుగురూపాయలు...అని మార్కెటులో ఒక నడి వయసు వ్యక్తి గొంతెత్తి అరుస్తున్నాడు. తోపుడు బండిలో గోభీ వున్నది.

రండి బాబూ! రండి.. నాలుగురూపాయలు —నిగనిగలాడే గోభీపువ్వులు—చూడండి—తీసుకోండి—నాలుగురూపాయలు—తీసుకోండి అని మొదటి బండివాడికి దగ్గరలోనేవున్న ఇంకొక బండివాడు నవయువకుడు మొదటివాడికంటే గొంతు ఇంకా పెద్దదిచేసి అరుస్తున్నాడు.

దీనితో ఇద్దరిమధ్యా పోటీ ఏర్పడినట్లయింది. కొత్త కొత్తగా గోభీపూలు మార్కెటులోకి వస్తున్నాయి. జనం కొద్ది కొద్దిగా కొంటున్నారు. అంత ఖరీదుపెట్టి గోభీపూలు కొనడానికి పెద్దఎత్తున జనం వెనక ముందాడుతున్నారు. అందువలన జనాన్ని ఆకర్షించడానికి రెండోబండి నవయువకుడు మరింత గొంతుపెంచి 'గోభీలు-నాలుగురూపాయలు' అని అరిచాడు.

నడివయస్సుగల మొదటి బండి వాడు తన కేకలు ఆపి విసురుగా రెండోబండి వాడివైపుకు వెళ్లాడు. అతడి చెంపమీద ఛెళ్ళుమని చెంప దెబ్బ వేశాడు. గద్దిస్తూ—'సా—లా—పంజాబీ—ఏమిటి ఆ అరుపు—పంజాబ్‌లోనే వుండలేక పోయినావా? పంజాబ్‌నుండి ఇక్కడికి వచ్చి మా వ్యాపారం పాడుచేస్తున్నావా? అంతపెద్దగా అరుపులెందుకు? నోరు మూసుకొని వ్యాపారం చేసుకో—జాగ్రత్త' —అన్నాడు. నవయువకుడికి ఎంతో అవమానం జరిగినట్లనిపించింది.—ఏమి చేస్తాడు? చెంప నవరించుకుంటూ—మొదటి బండివాడి వైపు అలాగే చూస్తూ వుండిపోయాడు.

నవయువకుడి తండ్రి నంద్‌లాల్‌కు ఆ చిన్న పట్టణంలోనే ఒక బట్టల దుకాణంలో పని దొరికింది. ఆ దుకాణంలో ఇంకా కొంతమంది పనివాళ్లున్నారు. వారిలో పంజాబీ ఇతనొక్కడే. ఆ దుకాణం యజమాని సేఠ్ తిపర్‌చంద్ పంజాబ్‌నుండి వచ్చిన వాడే. పంజాబీయే కాని అలా కనిపించడు. పంజాబీ మాట్లాడుతాడు. అతని తండ్రి దాదాపు ఏభై సంవత్సరాల క్రితం ఆ పట్టణానికి వచ్చి బట్టలవ్యాపారం ప్రారంభించి ఇక్కడే స్థిరపడి పోయాడు. అతనికి తనవారంటూ పంజాబ్‌లో ఎవ్వరూ లేరు. అతని బంధువులుగూడా అక్కడికే వచ్చి స్థిరపడ్డారు. తిపర్ చంద్ బాల్యమంతా పంజాబ్‌లోనే గడచింది. కాని అతని సంతానం పంజాబీ బాగా మాట్లాడలేక పోయేవి. ఇంట్లోగూడా అ

అయినా పాతకాలపు భాషాభిమానం వల్లనో లేక తనలో జీర్ణించుకొని వున్న పంజాబీ సంస్కారం వల్లనో లేక పంజాబ్ వంటి అగ్ని గుండంలో నుండి తప్పించుకొని వచ్చినవాడన్న సానుభూతివల్లనో తిపర్ చంద్, నందలాల్‌కు తన కొట్టులో ఉద్యోగమిచ్చాడు. పాపం—హిందూ సోదరుడు—కష్టంలో వున్నాడు అని గూడా తిపర్ చంద్‌కు జాలి కలిగివుండవచ్చును. నంద్‌లాల్ కొట్లో చేరాడు. అయితే మిగిలిన పనివాళ్లు తనుచేసిన ప్రతి పనినీ—అప్పుడప్పుడు జరిగిన పొరపాట్లనూ అంత పెద్దగా ఎందుకు చిత్రిస్తున్నారో నందలాల్‌కు అర్థం గావడంలేదు. అది అతనికి బాధాకరంగా గూడా వుంటున్నది. పంజాబ్‌లో వున్నప్పుడుగూడా నందలాల్ ఇటువంటి పనే చేసుండేవాడు. పదిహే నేళ్లగా ఇదేపని చేస్తున్నాడు. సేఠ్ విలాయత్‌రామ్ తిపర్ చంద్ కంటే గూడా పెద్ద బట్టల వ్యాపారి. అతని కొట్టులో తను పని చేసేవాడు. అందరి గుమాస్తాలలో తనకు తెలివైన వాడని పేరు. కొనుగోలు దార్లతో అతడు వ్యవహరించే తీరూ అవీ చూస్తే కొట్టు యజమాని అతడేనని గూడా బయటివాళ్ళు అనుకొనేవారు. లేక యజమాని బంధువనుకొనేవారు. కాని ఇక్కడ తిపర్ చంద్ కొట్లో "పంజాబీవాడు ఇలా కాక ఇంకెలా పనిజేస్తాడు !! బట్టలు సరిగ్గా పట్టుకోవడం గూడా తెలియనివాడు" అని వ్యంగ్యంగా తోటిపనివాళ్ళు అనడం ప్రారంభించారు. వీడు ఉగ్రవాది, ఈ పంజాబీవాళ్ళంతా ఒకటే రకం, వాడి కళ్ళుచూడు ఎట్లా వుంటాయో !! ఎట్లా మింగేసేవాడిలాగా చూస్తాడో !! గడ్డంపెంచి తలపాగా చుట్టుకొన్నా లేక తలవెంట్రుకలు కత్తిరించుకొన్నా వీళ్ళను అసలు నమ్మకూడదు. వీడికి దూరంగా వుండడం మంచిది అని తోటి పని వాళ్ళు అనడం గూడా తాను స్వయంగా విన్నాడు తరువాత పెదగా న: ౧లు....

తోటి పనివాళ్ళు ఆ కొట్లో అతణ్ణి బ్రతక నిచ్చేటట్లు లేరు. ఇక తన కొడుకు పరమాత్మానంద్ వ్యాపారం గూడా జరగనిచ్చేటట్లు లేరు. అ నడి వయస్సు కూరగాయల బండివాడు, పరమాత్మా నంద్‌ను ఈ రోజు గూడా మళ్ళీ కొట్టాడు. అంత గొంతు చించుకొని అరుస్తావెందుకంటాడు!! గొంతెత్తి అరచి జనాన్ని ఆకర్షించకపోతే కూరలెవరు కొంటారు? వ్యాపారం ఎలా సాగుతుంది ! ఎందుకు ఈ ద్వేషమో అర్థం గావడం లేదు.

అదొక చిన్న పట్టణం. అది ఏ ప్రాంతంలోనిదైనా కావచ్చును- హర్యాణా- రాజస్థాన్- హిమాచల్ ప్రదేశ్ లేక ఉత్తరప్రదేశ్ కావచ్చును. కాని పంజాబ్ మాత్రం కాదు,

నందలాల్ పంజాబ్‌కు చెందిన హిందువు. అతనికి బాధ కలిగిస్తున్న విషయ మేమంటే— పంజాబ్‌లో అతడు హిందువు. బయటి ప్రాంతాలలో పంజాబీ! అక్కడ హిందువని బాధ. ఇక్కడ తను పంజాబీ అని బాధ! ఏమిటిది?

నందలాల్ పల్లెటూరివాడు. ఒక చిన్న పట్టణానికి ఆ పల్లెటూరు మూడు మైళ్ళ దూరంలో వుండేది. ఆతంకవాదులు పల్లెల్లోనూ ఉన్నారు, పట్టణాలలోనూ వున్నారు. పంజాబ్‌లోని ప్రతిహిందువూ భయభ్రాంతుడై వున్నాడు. ఎప్పుడు ఏమి జరుగుతుందో తెలియని స్థితి ఏర్పడి వున్నది పల్లెల్లోని హిందువులు పట్టణాలకు చేరుకొంటున్నారు. పట్టణాలలో కొంతవరకైనా రక్షణ వుంటుందని వారి ఆశ. పట్టణాలలో బాధలు పడలేక తిరిగి పల్లెటూళ్ళకు వెళ్ళినవారు గూడా చాలామంది వున్నారు. పల్లెటూరి నుండి— పంచాయతీ వారు వచ్చి- మీరు లేకపోతే మాకు జీవనమే లేదు. మీరు గ్రామాలకు తిరిగి రండి అని నచ్చచెప్పి తీసుకొని పోతున్నారు కొంతమందిని. కొన్ని హిందూ కుటుంబాలు పంజాబ్‌ను వదలి వేరే ప్రాంతాలకు వెళ్లిపోయినాయి. అక్కడ హిందూ సోదరులతో కలిసి జీవితం సుఖంగా గడుపుదామని వారి ఆశ.

పంజాబ్‌లో రోజూ నందలాల్ తన సైకిల్ పైన గ్రామం నుండి పట్టణానికి వచ్చేవాడు. . విలాయత్‌రామ్ ఇంటినుండి తాళంచెవి తీసుకొని దుకాణం తెరచి రోజువారీ వ్యాపారం సాగించేవాడు. రాత్రి 8 గంటలకు దుకాణం మూసిన తరువాత ఇంటికి తిరుగు ముఖం పట్టేవాడు, నందలాల్ కొడుకు పరమాత్మానంద్ ఉదయం 5 గంటలకు సైకిల్ మీద గాడిద బరువు కూరగాయలు వేసుకొని ఇల్లిల్లూ తిరిగి కూరలమ్మేవాడు.

తననూ, తన కుమారుణ్ణి గ్రామంలో హత్య చేస్తారేమోననే భయం నందలాల్‌కు మనస్సులో ఏర్పడింది. అందుకని పనికి వెళ్ళకుండా వుండనూ లేదు, చీకటిని చూసి పారిపోనూ లేదు. సర్పత్రాచు లాంటి ఆ చీకటి ఒకరోజు ఆ కుటుంబాన్ని కాటు వేయక తప్పదు. తమ గ్రామంలో రాత్రులే తప్ప పగళ్ళే లేవన్నట్లు పట్టపగలే దారుణ హత్యలు జరుగుతున్నవి. పంజాబ్ ప్రాంతం అంతా అంధకార బంధురంగా వున్నట్లు అతని కనిపించింది. పంజాబ్ వదిలివెళ్ళితే వెలుగు వుంటుందని భావించాడు. వెలుగులోకి వెళదామని నిర్ణయించుకొన్నాడు,

♦ ♦ ♦

వెలుగనుకున్న చోట గూడా జీవితం సాఫీగా నడుస్తుందని నందలాల్‌కు కన్పించడం లేదు. తన వారైన హిందువులు తనను ఆదుకొంటారనీ, నిర్భయంగా బ్రతకవచ్చుననీ భావించి గంపెడంత ఆశతో పంజాబ్ వదలి నందలాల్ ఈ గ్రామం చేరాడు. కాని ఇక్కడ అందరూ హిందువులే, తన సోదరులే అయినా ఆ భావం ఏ హిందువులోనూ కనబడడం లేదు. పంజాబ్‌లో హిందువైనందుకు బాధపడ్డాడు. ఇక్కడ పంజాబీ అయినందుకు బాధ పడుతున్నాడు.

ఒకరోజు సేఠ్ శిపర్‌చంద్ అతణ్ణి పనిలో నుండి తీసివేస్తున్నట్లుగా చెప్పాడు. దుకాణంలో మిగతా పనివాళ్ళతో నీకు రోజూ గొడవలొస్తున్నవి. నీ దగ్గర ఏదో లోపం లేకపోతే వారంతా ఎందుకు గొడవ చేస్తారు? నీ మీద నేరాలు ఎందుకు ఆరోపిస్తారు? నీవు మరొకచోట పని చూసుకో భాయీ అన్నాడు.

నందలాల్ ఎక్కడికి వెళ్లాలి? ఏమి చేయాలి? ఆ పట్టణంలో ఆటువంటి ఇంకొక బట్టల కొట్టయినా లేదు పనికోసం చాలా చోట్ల తిరిగాడు. అందరూ అవసరం లేదని ఒకటే మాట చెప్పారు.

గత పదిరోజులుగా అతడు ఖాళీగా ఉన్నాడు. యజమాని రెండునెలల అడ్వాన్సు తీసుకొని అతనున్న ఆ గదిని అద్దెకు ఇచ్చాడు. రెండునెలలు పూర్తి కావస్తున్నవి. మరో రెండునెలలకు అడ్వాన్సు ఎక్కడినుండి తెచ్చి యివ్వగలడు? గది ఖాళీచేయవలసి వుంటుంది. పరమాత్మానంద్ సంపాదన గూడా అంతంత మాత్రంగానే వున్నది. ఆ నడివయసు కూరగాయల బండివాడు పరమాత్మానంద్‌ను ఎంతైనా బాధ పెడుతున్నాడు. పరమాత్మానంద్ దిగులుగా వుంటున్నాడు. మొదట పరమాత్మానంద్ పంజాబ్ వదలడానికే ఇష్టపడలేదు. ఏమి చేస్తాం నాన్నగారూ! మంచిరోజుల కొరకై ఎదురు చూద్దాం, తుఫాన్‌వచ్చింది, అదే నెమ్మదిగా తగ్గుతుంది అన్నాడు. అతని వయస్సటువంటిది. అతనికేమి తెలుసు లోకంతీరు! అనుకున్నాడు నందలాల్.

వారిది నలుగురున్న కుటుంబం, తండ్రీ కొడుకులూ, నందలాల్ భార్య, పన్నెండు సంవత్సరాల ఆడపిల్ల అదీ వారి కుటుంబం. ఆ పిల్లను స్కూల్లో చేర్పించారు. స్కూల్లో ఆ పిల్లగూడా దిగులుగా వుంటున్నది. ఆ పిల్లకు హిందీ మాట్లాడడం రాదు. పంజాబీ మాట్లాడుతుంది. ఆమె పంజాబీని వెక్కిరిస్తూ మిగతాపిల్లలు ఆట పట్టిస్తున్నారు. పగలబడి నవ్వుతుంటారు. పరిస్థితి ఇలాగే వుంటే వారు ఆకలితో గూడా బాధపడవలసి వుంటుంది. రెండుపూటల తిండి గడిచే అవకాశం కన్పించడం లేదు. తలదాచుకొనేందుకు చోటులేదు, సంపాదనలేదు. చుట్టుపక్కలవారి పరాయిచూపులు "మీరు ఇక్కడికి ఎందుకు వచ్చారు?" అని నిలదీసి అడుగుతున్నట్లున్నవి.

రోజూ లాగా ఆ రోజుగూడా రెండు బ్యాటరీల ట్రాన్సిస్టరు విన్నాడు. తరణ్ తారణ్ వద్ద కాలవ గట్టున సైకిల్ పైన వెళుతున్న ఒక బాలిక తుపాకి గుండు తగిలింది. అతను అక్కడికక్కడే ప్రాణాలు వదిలాడు. అది మోగేలో సాయంకాల వేళ ఒక దుకాణదారుడు కొట్టు మూసివేసి ఇంటికి వెళ్ళుతుండగా రద్దీగా వుండే సెంటర్‌లో నడిరోడ్డు మీద చంపివేయబడ్డాడు. ఇది రెండోవార్త ఇలాంటి వార్తలు రోజూ వినడం అతనికి అలవాటైపోయింది. మొదట మొదట ఆ వార్తలు వింటుంటే అతని శరీరం వణికిపోతూ వుండేది. అందువల్లనే తమ ఊరు వదలి ఈ ఊరు వచ్చాడు. ఊరు వదులుతున్నప్పుడు సామాన్లు ట్రక్కులో వేసుకొని, తన యింటి తలుపులన్నీ మూసి తాళం చెవి పక్కయింటి జర్నల్‌సింగు కిచ్చి 'భాయీ! ఇవి నీ వద్ద వుంచుకో. విధిలీల ఎలా వుంటుందో ఎవరు చెప్పగలరు? తిరిగి మే మిక్కడికి వస్తామో రామో తెలియదు. తిరిగి మేమిక్కడికి రాలేకపోతే ఈ యింటికి నీవే యజమానివి' అన్నాడు. జర్నల్‌సింగ్ కళ్ళు

చెమ్మగిల్లినవి. 'నందు భాయీ! అలా అనకు, తప్పకుండా తిరిగి వస్తావు. మీరొచ్చేంతవరకు ఈ యిల్లును కాపాడే బాధ్యత నాది. వెళ్ళవద్దని మీకెంతో నేను నచ్చజెప్పాను, అయినా నీవు వెళ్ళిపోవలెనని నిశ్చయించుకొన్నావు. ఇక నీ యిష్టం' అన్నాడు జర్నల్‌సింగ్. నందలాల్ తెల్లవారుజామున 4 గంటలకు ఈ ఊరు వదలిపెట్టాడు.

♦ ♦ ♦

అతను ఒక నిశ్చయానికి వచ్చాడు, ఒక ట్రక్కు మాట్లాడుకున్నాడు. తెల్లటి పగటి వెలుగులో తన సామాన్లు ట్రక్కులోకి ఎక్కించాడు. ఈరోజు తనదైన యిల్లు, తనవూరు, తన గడ్డ చేరగలడు. అర్ధరాత్రి అయినా భయంలేదు. తన వూళ్ళో తను దేనికి భయపడాలి?

తల్లీకూతురు డ్రైవరు పక్కన కూర్చున్నారు. పరమాత్మానంద్ ట్రక్కుపైన కూర్చున్నాడు. ఇంటి యజమానికి గది అప్పగించి నందలాల్ — భాయీసాహెబ్, మంచిది. మాకు మృత్యువే వ్రాసి వుంటే ఇక్కడ వస్తులుండి చావడం కంటే అక్కడ నా సొంత వూరిలో హాయిగా వున్నదితింటూ చావడమే మేలు' అని గది యజమాని దగ్గర సెలవు తీసుకొన్నాడు.

# సాహిత్య పరిణామ క్రమంలో రసం

సి.యస్వీ. అచ్యుతశర్మ

సామాజిక పరిస్థితుల్ని బట్టి సాహిత్యం మారుతుంటుంది. ఆ సాహిత్యమే రసస్థితిని నిలుపుతుంది. నన్నయ్య నుంచి నేటి దాకా సమాజ సాహిత్యాల పరిణామ క్రమం గమనించినట్లయితే ఈ పరిణామ క్రమం రసంలోనూ కనబడుతుంది. ఆ యా చారిత్రక యుగాలనాటి సాహిత్యం సామాజిక పరిస్థితులకూ-రసానికీ వారధిగా నిలుస్తుంది.

సంస్కృత లాక్షణికులు రసాన్ని నిర్వచించి, రస వైవిధ్యం చెప్పి, రస సమీకరణ చేసి, రసాలనంతాలని,కాని ఒకటే రసభావమని చెప్పారు. చివరికి రసాలు తొమ్మిది అనే వాదం మాత్రమే స్థిరంగా మిగిలింది. రసాలు తొమ్మిదైనా అంగిరసాలుగా నిలువగలిగేవి కొన్ని మాత్రమే. నన్నయ భారతం నుంచి నేటి విప్లవ కవిత్వం వరకు ఉన్న సాహిత్యాన్ని పర్యాలోకించినట్లయితే ప్రధానంగా రెండు రసాలు మాత్రమే అంగిరసాలుగా కనబడతాయి. అవే శృంగార వీరాలు.

రాచరిక యుగంలో రాజులకు వీరం ప్రధానం. వీరం లేకపోతే రాజుగా చలామణి కాలేడు. అందుచేత రాచరిక వ్యవస్థలో భాగమైన వీరం సాహిత్యంలోకి ప్రవేశించింది. రాజులు భోగలాలసులు. అందరికీ అనుభవ యోగ్యమైనది, ఆనంద ప్రదమైనదీ శృంగారం. రాజకీయ అస్థిరత్వం చోటు చేసుకున్న కాలంలో యుద్ధాలు ఎక్కువ కావడంతో రాజ్యాలు వెంట వెంటనే పతన మౌతుండేవి. తక్కువ సమయంలో ఎక్కువ ఆనందాన్ని ఇచ్చేది శృంగారం కనుక అది సాహిత్యంలో చోటు చేసుకుంది.

ఆధునిక యుగం వచ్చేసరికి శృంగార రసాన్ని తీసుకొని తమ అమలిన శృంగార ప్రతిపాదనతో విప్లవాత్మకమైన మార్పులు తెచ్చారు ఆచార్య రాయప్రోలు.

శృంగారపు పరిణతరూపం భావ కవిత్వం, వీరపు పరిణత రూపం అభ్యుదయ విప్లవ కవిత్వాలేమో! ననిపిస్తాయి. ఈ దృష్టితో సాహిత్యాన్ని పర్యాలోకిస్తే బాగుంటుందనే ఆలోచనకి అక్షర రూపం ఈ వ్యాసం.

'రసోవై సః రసగంహ్యేవాఽయం లబ్ధ్వాం ఆనందీభవతి,' అని తైత్తరీయోపనిషత్తు, రసమే పరమాత్మ స్వరూపం. ఆ రసాన్ని పొందే జీవుడు ఆనందానుభూతిని పొందుతున్నాడు. రసాలు మానవ భావ జనితాలే. వాటిని సాహిత్యంలో తిరిగి తాను పొంది, మానవుడు ఆనందాన్ని పొందుతున్నాడు. 'బాహిర జగత్తు మనస్సులో ప్రవేశించి మరొక జగత్తుగా, సాహిత్య జగత్తుగా అవతరిస్తుంది' అంటారు రవీంద్రనాథ్ ఠాకుర్. పరమాత్మ రస స్వరూపం. ఏదైతే ఆనందమో అదే పరమాత్మ, అదే రసం.

'రస్యతే ఆస్వాద్యతే ఇతి రసః'. ఆస్వాదింప బడేది రసం. ఆస్వాదన సహృదయనిష్ఠం. ఆస్వాద్యమయ్యేది లోకవృత్తం ద్వారా సాహిత్యంలో ప్రవేశించేదే.

'నానా భావోపసంపన్నం నానావస్థాంతరాత్మకం ।
లోకవృత్తాను కరణం నాట్యమేత న్మయా కృతమ్ ॥

సప్త ద్వీపానుకరణం నాట్యే హ్యస్మిన్ ప్రతిష్ఠితం॥'

సంఘటనల నాధారంగా చేసికొని ప్రతిస్పందించేది మానవుడు. అనేక భావాలు సందర్భానుకూలంగా మనిషిని చైతన్య వంతుణ్ణి చేస్తాయి. అలా చైతన్యాన్ని కలిగించేవే భావాలు. భావ ప్రకటన రెండు రకాలు. 1. చేష్టారూపం 2. వాగ్రూపం ఆంగికాభినయం ద్వారా వాక్ సహాయంతో అభివ్యక్తీకరించేది భావం.

లోకవృత్తానుకరణం సాహిత్యం కనుక మానవుడు ఏ భావంలో వెంటనే ప్రతిస్పందించగలడో అటువంటి భావాల్ని అభివ్యక్తీకరించేవే ఇప్పుడు మనం వ్యవహరిస్తున్న రసాల పేర్లు.

ప్రతి మానవుడికీ అనుభవ యోగ్యమైనవి అనేక భావాలు ఉన్నప్పటికీ నిరంతరం అనుభవించే భావాలు కొన్ని మాత్రమే. ఈ భావాల సమ్మిశ్ర తత్వంవల్ల, విభావాది సంయోగం వల్ల రసం పుడుతుంది.

అనుభవం రెండు రకాలు.

1. భావానుభవం
2. భౌతికానుభవం.

భావానుభవం అంటే ప్రతిమానవుడు తను భావాన్ని అనుభవించి తద్వారా ఆనందం పొందడం.

ఉదాహరణకి సహృదయుడు శకుంతలను అత్తవారింటికి పంపే సందర్భంలో ఆ సన్నివేశాన్ని భావంలో తలచుకొని. ఆ భావం ద్వారా అనుభూతిని పొంది, ఆ పాత్రలో తన్మయత్వాన్ని పొందడమే భావానుభవం.

తనే స్వయంగా తన కుమార్తెను అత్తవారింటికి పంపే సందర్భంలో పొందేది భౌతికానుభవం. అనుభవయోగ్య మన్నమాట! ఈ భావాన్నే దాసు....

'రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్
పర్యుత్సుకో భవతి యత్సుఖితోఽపి జంతుః
తచ్చేతసా స్మరతి నూనమబోధ పూర్వం
భావ స్థిరాణి జననాంతర సౌహృదాని'
(అభిజ్ఞాన శాకుంతలం-5 వ అంకం)

అనే శ్లోకంలో వివరించాడు.

కావ్యేతిహాస ప్రక్రియతో ప్రారంభమైన తెలుగు సాహిత్యం కావ్యప్రబంధ ప్రక్రియగా పరిణమిస్తూ వచ్చింది. వీటితో పాటుగా మొదటి నుంచి శతకోదహరణాది ప్రక్రియలు కూడా సాగుతూనే ఉన్నాయి. ఈ ప్రక్రియల్లో కొన్ని వస్తు ప్రధానాలు కాగా, కొన్ని రస ప్రధానాలుగా తమ రూపును సంతరించుకున్నాయి.

ఈ సాహిత్యంతో పాటుగానే రసం కూడా తన రూపును కాలానుగుణంగా మార్చుకుంటూ వచ్చింది.

తెలుగులో తొలి రచన 'మహాభారతం'లో అంగిరసం వీరం. ఈ కాలంలో వెలువడ్డ సాహిత్యంలో మరే రసమూ-అంటే శృంగారాది రసాలు ప్రధానంగా ఉన్నట్లు కనబడదు. దీనికి కారణం...

'ప్రాచీన సాహిత్యమున ప్రధానంగా ఐహికాముష్మిక ఫలైకకాంక్షాత్మకులై వర్తించెడివారు.

పురాణేతిహాసముల యందు పారమార్థిక ధర్మముల సాధింప బూనిన విశిష్ట వ్యక్తుల గాథలు వర్ణితములైనవి.' (వీరరసము-ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం-పుట 476)

నిజానికి వీర, శృంగారాలే అంగి రసాలుగా ఉండాలని లాక్షణికులు నిర్ణయించారు కానీ, నన్నయ్య తరువాతికాలంలో శాంత, కరుణ, అద్భుత, భక్తి-అంగిరసాలుగా గల కావ్యాలు సాహిత్యంలో కనబడుతున్నాయి. ఆ కారణంగా భిన్న అభిరుచులు గల పాఠకులు, శ్రోతలు భిన్న ప్రాంతాల్లో ఉండటం వల్ల వారి అభిరుచికి తగినట్లుగా రసప్రధాన కావ్యం వెలువడడం జరుగుతుంది.

ప్రబంధయుగం వచ్చేసరికి కవులు ఎక్కువ మంది బయలుదేరారు. అంతకు పూర్వపు యుగాల్లో కవులు ఉన్నా అంతగా ప్రతిభలేనివారు గుర్తింప బడేవారు కాదు. వారిని అప్రతిభులు అనలేము. కాక పోతే వారు రాచరికవ్యవస్థపై మక్కువ చూపలేదు. రాజ సత్కారాలనూ తిరస్కరించి ఉండవచ్చు. కాని, ప్రబంధ యుగంలో కవులందరూ ఒకరిని మించినవారు మరొకరు కావడంతో కవులందరినీ ఒక చోట చేర్చాలనే సాహితీ రసికత్వం కల రాజు ఉండడంతో చాలామంది కవులకు గుర్తింపు లభించింది. రాజులు కూడా సాహితీ సమరాంగణ సార్వభౌములు కావడంతో సాహిత్యం మరింత కీర్తి ప్రతిష్ఠలను సాధించ గలిగింది.

ఐతే ముందు చెప్పుకున్నట్టు 'ఐహికాముష్మిక కాంక్ష' తగ్గిపోవడంతో ...

'ప్రబంధములయందా దృష్టి క్రమముగా తగ్గి యైహిక ఫలోద్దిష్టములైన ధర్మములను సాధించు ప్రవృత్తులు రావుగ గల్పించుకొనినవి. విషయ సుఖములే వానియందు గుమిగూడి శృంగారమునకు బట్టము కట్టినవి' (వీరరసము)

ఇలాంటి తరుణంలో 'వస్తు పాండిత్యం కంటే ప్రతిభే గొప్పది' అని నిరూపించడం కోసం 'ప్రభావతీ ప్రద్యుమ్నము' లాంటి ప్రబంధాల్ని ప్రతీకాత్మకంగా రచించడం జరిగింది.

ఇలాంటి పరిస్థితే కొనసాగుతున్న తరుణంలో రాజకీయంగా అస్థిరత్వం చోటు చేసుకోవడంతో యుద్ధాలు ఎక్కువై రాజ్యాలు వెంటవెంటనే పతన మౌతుండేవి. ఉన్న తక్కువ కాలంలో ఎక్కువ ఆనందాన్ని అనుభవించాలన్న తాపత్రయమేమో? శృంగారంలో అంగాంగ వర్ణనలు శ్రుతి మించాయి. కవుల్లో పాండిత్యం ఉన్నవారే కాని ప్రతిభ కలవారు కరువయ్యారు. దాంతో సాహిత్యంలో రస పోషణ క్షీణదశకు చేరుకుంది. అంటే రసం-సాహిత్య పరిణామ క్రమంలో పతనోన్ముఖంగా సాగిందన్న మాట!

నవ్య సాహిత్య యుగం వచ్చేసరికి అప్పటికే బ్రిటిష్ వారి చేత నానా హింసలు అనుభవిస్తూ పీడింపబడుతున్న తెలుగుజాతిలో దాస్య శృంఖలాలను పగులగొట్టి, స్వాతంత్ర్య సమర దీక్షా కంకణ బద్ధుల్ని చేయడానికి, దేశాభిమానాన్ని పెంపొందింప చేయడానికి సాహిత్యం ఎంతో ఉపయోగపడింది. గడియారం వేంకట శేషశాస్త్రి గారి శివభారతము లాంటి వీరరస ప్రధాన కావ్యాలు తెలుగు జాతికి స్ఫూర్తినిచ్చాయి.

ఒక పక్క నవల, నాటకం, కథానిక మొదలైన కొత్త ప్రక్రియలు వికసించగా, శ్రీపాద కృష్ణ మూర్తి శాస్త్రి, విశ్వనాథ గారలు ప్రాచీన సాహిత్య మార్గాన్నే పయనిస్తూ వచ్చారు. ఇలా కొత్త కొత్త ప్రక్రియలు, భిన్న భిన్న మార్గాలలో వెలువడడానికి కారణం ఆ యా అభిరుచులు గల వ్యక్తులు సమాజంలో ప్రవర్తిల్లడమే!

అంత వరకూ ఇతివృత్తం—కవిత్వం రెండూ ఒకదాన్నొకటి పెన వేసుకుంటూ వచ్చి, ఈ యుగం వచ్చేసరికి ఇతివృత్తం నవలను ఆశ్రయించింది. దాంతో నవల రసానికి నిలయమైంది. కవిత్వం ఇతివృత్తం నుంచి వేరై కవిత్వంగా మాత్రమే నిలిచిపోయింది భావ స్థితిలోనే ఆగిపోయింది. దీనికి కారణం రసం-విభావానుభావ వ్యభిచారులతో సంవళితయై, ఇతివృత్తాన్ని ఆశ్రయించి ఉంటుంది'. ఈస్థితిలో భావకవిత్వం పేరుతో 'శృంగార'భావం. అభ్యుదయ, విప్లవ కవిత్వాల పేరుతో 'వీర' భావం బయలుదేరాయి.

ఈ విధంగా ఒకప్పుడు శృంగార, వీరాలు రెండు మాత్రమే అంగి రసాలుగా ఉండాలని ముద్ర వైచుకొని, సమాంతరంగా ప్రవహిస్తూ వచ్చిన ఈ రసద్వయం ఆధునిక కవిత్వంలో కూడా రెండు 'భావాలు'గా మిగిలాయి. దీనికికారణం వ్యక్తిని స్పందింపచేసే గుణం వీటిలో ఇబ్బడి ముబ్బడిగా ఉండటమేనని చెప్పుకోవచ్చు. ఒకప్పుడు శృంగార వీరాలు మాత్రమే అంగిరసాలుగా ఉండాలి అని చేసిన నిర్ణయం నేడు రెండు 'భావాలు'గా తమ అస్తిత్వాన్ని చాటుతున్నాయి.

అయితే ప్రాచీన సాహిత్యంలో ఇతి వృత్తాలను ఎన్నుకోవడంలో కూడా ఒక నియమాన్ని పాటిం చారు. కవి క్రాంతదర్శి కావడంచేత, ఆ సమాజం లోని జనులు ఏ రకమైన రచనల్ని ఆకాంక్షిస్తు న్నారో పసిగట్టి, అలాంటి రసం పోషించి వారికి నచ్చే రీతిలో రచనను వెలువరించినట్లు కనబడు తుంది.

కావ్యపు ఫలం ఆనందం కాబట్టి, రసాలు ఆనందదాయకాలు, కనుక అటు సమాజానికీ, ఇటు కృతి భర్తకూ నచ్చే విధంగా ఇతివృత్తాన్ని స్వీకరించి, ఉభయులకూ ఆనందామృతాన్ని పంచు తున్నాడు కవి.

ప్రాచీన సాహిత్యంలో ఒక పాత్రను నాయ కుడిగా తీసికొని, దాన్ని ఆదర్శపాత్రగానూ, సాహి త్యాన్ని ఆదర్శ సాహిత్యంగానూ భావిస్తున్నారు. కాలంతోపాటు కావ్య నాయకత్వ లక్షణాలు మారాయి. అభిరుచులు మారాయి. సాహిత్య ప్రక్రి యలు మారాయి. 'సమాజానికీ-సాహిత్యానికీ వార ధిగా ఉన్న రసం కూడా మారుతున్నది అన్న విషయమూ స్పష్టపడుతుంది.



## స్వర్ణపతక విజయినీ

కుమారి ప్రభల లక్ష్మీభారతి, 1990 ఆగస్టులో జరిగిన దక్షిణ భారత హిందీ ప్రచార సభ, మద్రాసు వారి 'రాష్ట్రభాషా విశారద' పరీక్షయందు, రాష్ట్రం మొత్తం మీద మొదటి ర్యాంకులో ఉత్తీర్ణురాలై బంగారు పతకం పొందినది. ఈ విజయిని తెనాలి హిందీ ప్రేమీ మండలి మహావిద్యాలయ విద్యార్థిని.

# కుందుర్తి - తెలంగాణ

డా॥ ఎ. పద్మబాల

ఆధునికాంధ్ర కవిత్వంలో భావకవిత్వం, అభ్యుదయ కవిత్వం అనేవి ఉద్యమాలుగ స్థిరపడి ప్రత్యేకతను సంతరించుకున్నాయి. అభ్యుదయ కవిత్వాన్ని ప్రచారంలోకి తీసుకొచ్చిన కవితాఉద్యమం వచనకవితోద్యమం. కావ్యరచనలో ప్రాధాన్యం వహించిన ఛందోబద్ధమైన పద్యకవితకు, భావకవిత్వ కాలంనాటికి బాగా ప్రచారంలోవున్న గేయ కవిత్వానికి స్వస్తిచెప్పి అభ్యుదయ కవిత్వం వచన కవిత్వాన్ని ప్రచారంలోకి తీసుకొచ్చింది.

వచన కవిత్వానికి వచన పద్యం, వచన గేయం, వచనగీతం, స్వచ్ఛందకవిత, ఫ్రీవర్స్- అనేవి పర్యాయపదాలుగ వ్యాప్తిలో వున్నాయి.

భావకవిత్వం ప్రభావం తగ్గి, అభ్యుదయ కవిత్వం ప్రారంభంలో వున్నపుడు వచనకవిత్వానికి శ్రీకారం చుట్టబడింది. వచనకవిత్వానికి పితామహుడుగ కుందుర్తిని పేర్కొంటారు. తిలక్, దాశరథి, సి. నా. రె. ఆరుద్ర, సోమసుందర్, శేషేంద్ర తదితర కవులు వచనకవిత్వాన్ని పరిపుష్టం చేశారు.

వచనకవిత్వ మహోద్యమానికి అనేక విధాల కృషి చేసినవాడు కుందుర్తి ఆంజనేయులు. అటువంటి కుందుర్తి జీవితాన్ని, రచనల్ని ప్రస్తావించడం, ఆతని రచనల్లోని కథాకావ్యమైన 'తెలంగాణ' ను గురించి పరిచయం చేయడమే ఈ వ్యాసముఖ్యోద్దేశం.

## కుందుర్తి జీవితం :

ఆధునికాంధ్ర కవిత్వంలో అభ్యుదయకవి, వచనకవితా పితామహుడు అయిన కుందుర్తి ఆంజనేయులు, గుంటూరు జిల్లా, నరసారావుపేట తాలూకాలోని కోటవారిపాలెంలో నరసమ్మ కామయ్యలకు 1922 వ సం॥లో డిసెంబర్ 16వ తేదీన జన్మించాడు. వీరి పూర్వికులు కుందుర్తి వాస్తవ్యులు కావడంవల్ల వీరి ఇంటిపేరు 'కుందుర్తి'

కుందుర్తి బాల్యంలో తండ్రి మరణించాడు. ఆతని బాల్యమంతా తాతగారి ఊరైన వినుకొండలో గడిచింది. కుందుర్తిచదువు కోసం తల్లి నరసమ్మ ధనవంతుల యిళ్ళల్లో పనిచేసి, పాలు అమ్మి సంపాదించేది.

కుందుర్తి వినుకొండలోని బోర్డ్ మిడిల్ స్కూల్లో 8వ తరగతి వరకు, తొమ్మిది నుండి ఎస్.ఎస్.ఎల్.సి. వరకు బెజవాడ మునిసిపల్ హైస్కూల్లోను, ఇంటర్ విజయవాడలోని ఎస్.ఆర్. ఆర్. కాలేజీలోను బి.ఎ. గుంటూరు ఆంధ్ర క్రిష్టియన్ కాలేజీలోను చదివాడు.

ఆతనికి సుందరమ్మతో బి.ఎ. చదివే రోజుల్లోనే పెళ్ళైంది. సంతానం-ఐదుగురు అమ్మాయిలు, ఒక అబ్బాయి.

కుందుర్తి తొలుత తెనాలితాలుకాలోని రేవేంద్ర పాడు నేషనల్ కాలేజీలో 1943 లో ఆంగ్ల భాషా బోధకుడిగా చేరాడు. 1946 లో గుంటూరు టుబాకో మార్కెటింగ్ కమిటి ఇన్‌స్పెక్టరుగ, 1956 లో కర్నూల్లో ఇన్‌ఫర్‌మేషన్ అండ్ పబ్లిక్ రిలేషన్స్‌లో అనువాదకుడిగ, అక్కడనుండి హైదరాబాదు, అక్కడినుండి మహబూబ్‌నగర్‌కు అక్కడినుండి మళ్ళీ హైదరాబాదుకు డిస్ట్రిక్ట్ పబ్లిక్ రిలేషన్ ఆఫీసరుగ 1966 లో బదిలీ అయ్యాడు. 1977 డిసెంబర్‌లో 'ఆంధ్రప్రదేశ్' తెలుగు మాసపత్రిక సంపాదకుడిగ పదవీ విరమణ చేశాడు కుందుర్తి. వీరు 1982 అక్టోబర్ 25 న పరమపదించారు.

శ్రీశ్రీ నాయకత్వంలోని అభ్యుదయ రచయితల సంఘంలో కుందుర్తి సభ్యుడిగ వుండి సంఘ అభ్యుదయానికి కృషిచేశాడు. 1966 లో కుందుర్తి ఆశయంతో 'ఫ్రీవర్స్‌ఫ్రంటు' సంస్థ ఏర్పడింది ఫ్రీవర్స్‌ఫ్రంటు వచన కవితా ప్రచారంకోసం ఏర్పడింది ఫ్రీవర్స్ ఫ్రంటు తరపున 'నయాగరా' (కుందుర్తి, రామదాసు, సుబ్రహ్మణ్యం కలిసి రాసింది), నగరంలో వాన, నా లోని నాదాలు (కుందుర్తి), వైతరణి (సి.వి. కృష్ణారావు) అనే కవితా సంపుటాలు, 'వచనకవిత' అనే వ్యాస సంకలనం 'తరంతరం' అనే వివిధ కవుల కవితల సంపుటి ప్రచురిత మయ్యాయి.

ఫ్రీవర్స్ ఫ్రంట్ సంస్థ ఏటేటా ఒక ఉత్తమ వచన కవితా సంపుటానికి బహుమతిని తిలక్ సంస్మరణార్థం ప్రకటిస్తూ వచన కవితోద్యమాన్ని ప్రోత్సహిస్తూవుంది. ఈ సంస్థనుండి, డా॥ఎన్.గోపి (మైలురాయి), దేవీప్రియ (అమ్మచెట్టు), శ్రీమన్నారాయణ (వెలుతురు పిట్టలు), ఇస్మాయిల్ (మత్స్య వృక్షం) కె. శివారెడ్డి (రక్త సూర్యుడు) మొదలైన వారు బహుమతుల్ని పొందారు.

## కుందుర్తి రచనలు :

కుందుర్తి తన 15 వ ఏటనే 'ఆపదుద్ధారక' శతకాన్ని రాశాడట. 1933 లో జపాన్ వస్తు బహిష్కరణని పురస్కరించుకొని నైజాము విజయవాడ వచ్చినపుడు, కొన్ని పద్యాలు రాసి కుందుర్తి రామమోహనరాయ్ గ్రంథాలయంలో చదివాడట. రాయప్రోలు 'తృణకంకణం' ప్రేరణతో 1939-40 ప్రాంతంలో 'రసధుని' అనే కావ్యాన్ని తేటగీతల్లోనూ, 'అమావాస్య' అనే విరహకావ్యాన్ని వృత్తాల్లోనూ రాశాడు. 'నాప్రేయసి' అనే ఖండ కావ్యాన్ని ఈ కాలంలోనే రాశాడు. 1942 లో 'సౌప్తికం' అనే అశ్వత్థామ అర్థరాత్రి సాహసాన్ని కొనియాడే సుదీర్ఘకవిత్వాన్ని రాశాడు. అయితే యివన్నీ అలభ్యాలే. సౌప్తికం మాత్రం భారతి ప్రచురితం. ఈ 'సౌప్తికం' విశ్వనాథ 'రామాయణ కల్పవృక్షం' లోని బాలకాండ ప్రభావంతో సమాస భూయిష్టంగా రాయబడ్డదనే విమర్శకు గురైంది. జాషువా గూడ కుందుర్తిని మందలించాడట. తర్వాత కుందుర్తి సరళమైన పద్ధతిలో కవిత్వం రాయ నారంభించాడు.

కుందుర్తి 'నానాసాహెబ్' పైన్మాత్రాఛందస్సులో గేయాల్నిరాసి, ఏలూరు నవ్యసాహిత్య పరిషత్ వార్షిక సమావేశంలో చదివాడు. 1943 ప్రాంతంలో శ్రీశ్రీ మహాప్రస్థానం చేత ఆకర్షితుడై, అభ్యుదయ రచనలవైపు మళ్లాడు. కుందుర్తి వచన కవితల్ని, వచన కథాకావ్యాల్ని, వచన కవితా నాటికల్ని, పీఠికల్ని, వ్యాసాల్ని, తన జీవితచరిత్రనీ రాశాడు.

## వచన కవితలు ;

'నయాగరా' (1944) కొంత వచనంలోను, కొంత మాత్రా ఛందస్సులోను సాగిన రచనని పిస్తోంది. 1956 లో 'తెలంగాణ' సుదీర్ఘ వచన కవితాకావ్యము, 1958లో 'ఆశ' అనే వచన

కవితానాటకము, 'యుగే యుగే' అనేది, 1967 లో 'నగరంలో వాన', 'నాలోని నాదాలు' అనేవీ ప్రచురితమైనాయి. 1975 లో కుందుర్తి సన్మాన సంఘంవారు, కుందుర్తి వచనకవితలైన 'దండియాత్ర', 'మాతృగీతం', 'ఇదీ నాదేశం', 'భగవంతునికి బహిరంగలేఖ', 'అనువాదమాల', 'సాహసయాత్ర'; 'వేకువ వెలుగులు', 'శిక్షఏమిటి' అనేవాటిని 'కుందుర్తి కృతులు'గ ప్రచురించారు. కుందుర్తి మరణానంతరం 1982లో 'హంస ఎరిగి పోయింది', 1983 లో 'తీరానేనుకాస్తా ఎగిరి పోయాక' అనే వచనకవితా సంపుటాలు ప్రచురిత మయ్యాయి.

## వచన కథా కావ్యాలు :

తెలంగాణ, దండియాత్ర, సాహసయాత్ర, ఒక అముద్రిత కావ్యం.

## వచన కవితానాటికలు :

ఆశ, ఆచార్లగారమ్మాయి, శిక్ష ఏమిటి.

## అవార్డులు :

'నగరంలోనివాన' నాలోని నాదాలు' అనే వాటికి 1969 లో సోవియట్‌ల్యాండ్ నెహ్రూ అవార్డు లభించింది. 'నగరంలోనివాన'కు 1970 లో ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ అవార్డు, 'కుందుర్తి కృతులు'కు 1977 లో కేంద్రసాహిత్య అకాడమీ అవార్డు వచ్చాయి. ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీ అవార్డు ప్రదానోత్సవ సందర్భంలో సభాధ్యక్షులైన దివాకర్లవారు కుందుర్తిని 'వచనకవితా పితామహుడు' అని ప్రశంసించారు. అది కుందుర్తికి బిరుదైంది.

'మేఘమాల' అనే కవితాసంపుటిలో 32 ఖండికలున్నాయి. కుందుర్తి ఒక కవితా సంపుటికి పేరు పెట్టలేదు. ఇందులో, అంతర్జాతీయ బాలల సంవత్సరం, ప్రగతి, నోకామెంట్, వారి మృత్యువు గొప్పేమిటి, మునులూ-మూర్ఖులు, నాయకోదాహ రణం, ఎక్కడిదాధ్వని, భవిష్యత్తుకు లేఖ, ముక్త కాలు, ఈ విగ్రహం, మొండిచెట్టు, జాలిమనసు, ఒకగుర్రం కొంటాను, నాకు స్వేచ్ఛ కావాలి, మెళ్లో నా కో బిళ్ళ, కవిత్వంవచ్చాక, అష్టాచెమ్మ, రక్తం బావి, కోటచుట్టూ కంచకం, ప్రతిపక్షంలో సూర్యుడు ఒకదోమ వచ్చింది, కాలనివాడు, ఓట్లజాతర, నన్నెందుకు పిలిచారు, మరుజన్మ, నగిషీలు,— వంటి 26 ఖండికలున్నాయి. అందులో 18 ఖండిక లకు శీర్షికలు లేవు. వీటిలో కొన్ని అనువాదాలు కూడ ఉన్నాయి. అవి సోవియట్‌భూమిలో ప్రచురిత మైనాయి.

## పీఠికలు :

వచన కవితా సంపుటాలకు పీఠికలు రాసిన ఘనత ఆధునికుల్లో కుందుర్తికే దక్కుతుంది. ఇతని పీఠికల్ని 'స్పందన సాహితీ సమాఖ్య' వారు 'కుందుర్తి పీఠికలు' అనే గ్రంథంగా 1977 లో ముద్రించారు. కుందుర్తి తన వచనకవితా సంపు టాలకు గూడ పీఠికలు రాసుకున్నాడు. 1963 నుండి 1976 వరకు మొత్తం 23 పీఠికలు, 1976 తర్వాత 17 పీఠికలు రాశాడు. 'అమృతం కురిసిన రాత్రి'కి (తిలక్), 'చైతన్య కేతనం' అనేదానికి, నయాగరా ద్వితీయముద్రణకూ, 'తరం తరం', 'మనిషికోసం' మొదలైన వాటికి పీఠికలు కుందుర్తి రాశారు.

## వ్యాసాలు :

కుందుర్తి వచన కవితా తత్త్వ నిరూపణ కోసం చాల వ్యాసాల్ని రాశాడు. పత్రి కల కోసం, రేడియో ఉపన్యాసాల కోసం ఇతడు

వ్యాసాలు రాశాడు. మొత్తం వ్యాసాలు (46 పత్రికల కోసం + 8 రేడియోల కోసం) = 54.

## జీవిత చరిత్ర :

కుందుర్తి తన జీవిత చరిత్రను 86 పేజీల వరకు వ్యవహారిక భాషలో రాశాడు. ఇందులో విజయనగరం, గుంటూరు సభల ప్రసక్తి, నవ్య కళా పరిషత్తు, ఫ్రీవర్స్ ఫ్రంట్ స్థాపన, యుద్ధ కాలంలో తన రచనలు 1973 లో జరిగిన ఆంధ్రోద్యమ ప్రస్తావన వున్నవి.

కుందుర్తి రచనలు కొన్ని ఆంగ్లంలోకి, హిందీలోకి అనువదింపబడ్డాయి. రాయప్రోలు సంపాదకీయంలో వెలువడిన 'ఈస్ట్ అండ్ వెస్ట్ నెం. 4-' అనే దానిలో ఒక కవిత, ఎ. వరద రాజేశ్వరరావు సంపాదకీయంలో వెలువడిన 'మోడరన్ ఇండియన్ పొయిట్రీ'లో ఒక కవిత, పొయిట్ యాన్ ఇంటర్ నేషనల్ మంత్లీ'లో ఎనిమిది కవితలు, వేగుంట మోహన ప్రసాద్ సంపాదకీయంలో వెలువడిన 'దిన్ టైమ్ సెన్స్'లో మూడు కవితలు అనువదింపబడ్డాయి.

## వచనకథా కావ్యం-తెలంగాణ ;

కుందుర్తి వచన కవిత్వం కథా ప్రాధాన్యం గలదిగ వుండాలని భావించాడు. ఇంకా సినారె, కె. వి. రమణారెడ్డి, సోమసుందర్, సంపత్కుమార తదితరులు గూడ పై అభిప్రాయంగలవారే.

ఆధునికాంధ్రకవిత్వంలో సినారె ద్వారా గేయ కథా కావ్య నిర్మాణం ప్రారంభమైన పిదప వచన కవిత్వంలో ఆరుద్ర, సోమసుందర్, కుందుర్తి, శీలా వీర్రాజు, రథి సోమయాజి వంటి ప్రముఖులు కథా కావ్యాల్ని రాశారు. ఆరుద్ర—సినీవాలి, సోమసుందర్—మేఘరంజని, శీలావీర్రాజు—కొండి గట్టిన సూర్యుడు, అద్దెగది, రంధిసోమయాజి—బూర్జువా పెళ్లి కూతురు-అనేవి ఇతరుల వచనకథా కావ్యాలు.

కుందుర్తి వ్రాసిన, 'దండయాత్ర', 'తెలంగాణ', 'అముద్రిత కావ్యం', 'సాహసయాత్ర'- అనే వచన కథా కావ్యాల్లో, 'తెలంగాణ';అనే వచన కథాగేయాన్ని ఈ వ్యాసంలో సమీక్షించడమైనది.

'తెలంగాణ' ఉద్యమ సంబధమైన కావ్యం. తెలంగాణ ఉద్యమ కాలం నాటి తెలుగు ప్రాంతం తీరు తెనుల్ని కుందుర్తి ఈ వచన కథా కావ్యంలో చిత్రించాడు.

తెలంగాణాలో నవాబుకు వ్యతిరేకంగా కార్మికులు, కర్షకులు, జరిపిన విప్లవోద్యమాన్ని ఒక సమగ్ర కావ్యంగా రాశాడు కుందుర్తి. 'ఈ కవి తెలంగాణా విప్లవోద్యమ గాథను భారతగాథగా వ్యంజించి 'ప్రస్తావన, సింహాసన, బీజోత్పన్న, సంఘోదయ, ప్రజోద్యమ, రాయబార, బహిష్కార అజ్ఞాత, మానభంగ, గృహదహన, ప్రతిఘటన, దిగ్విజయ, భూమిదాన, న్యాయదాన, రజాకార, దురాగత, దండయాత్ర, ఉపసంహార' అను అష్టాదశ పర్వములుగ విభజించి రసవత్తరముగా కావ్యము రచించినాడు." అని డా॥సినారెగారన్నారు. 'ఈ కావ్యంలో ప్రయోగింపబడిన 'సంఘము' కమ్యూనిష్టు పార్టీకి సంకేతము. ఈ పార్టీ ప్రోద్బలముతో ప్రజలు జరిపిన ప్రతిఘటనను కుందుర్తి చిత్రించినాడు, ఈ విషయమును కవి స్వయముగ ఒప్పుకున్నాడు. అని సినారెగారు ఆధునికాంధ్ర కవిత్వము - సంప్రదాయములు - ప్రయోగములు అనే గ్రంథంలో అన్నారు. ఈ విషయానికి సంబంధించి కుందుర్తి రాసిన మాటలు యిలా వున్నాయి. 'చారిత్రక పరిణామంలో మరీ పాత దైపోయిన ఫ్యూడల్ వ్యవస్థమీద ఒకపెద్ద తిరుగు

బాటుగా తెలంగాణా ఉద్యమాన్ని నేను భావించాను' ఈ దృక్పథంతోనే కావ్యం మొత్తం నిర్వహింప బడింది. విప్లవోద్యమంలోని వివిధ సంఘట నలకు, కష్టనష్టాలకు, బాధలకు, కన్నీటి గాథలకు, రక్తాన్ని రంగరించే సన్నివేశాలకు కుందుర్తి గౌరవాన్ని కల్పించాడు.

కుందుర్తి 18 భాగాల్ని ఏకసూత్రతతో నిర్మిం చాడు. కుందుర్తి తెలంగాణ కావ్యాన్ని, 1. తెలం గాణా పోరాటం, 2 ప్రజాస్వామ్య వ్యవస్థ స్థాపన 3. వర్గరహిత సమాజం అనే మూడు ప్రధానాం శాల్ని దృష్టిలో పెట్టుకొని రాశాడని చెప్పవచ్చు.

నిజాం నిరంకుశ పాలనావ్యవస్థను కూకటి వేళ్ళతో పెకలించి దానిస్థానంలో ప్రజాస్వామ్య ధ్వజాన్ని ఎగురవేయాలన్న కాంక్షను 'తెలంగాణ' కావ్యంలో కుందుర్తి వ్యక్తంచేశాడు. ఈ ప్రయ త్నంలో నిజాంను ప్రజలు ఎదిరించడం, నిజాం కింద వున్న పోలీసులు, రజాకార్లు వంటి వారు ఆగడాలుచేసి తిరుగుబాటును అణిచేందుకు ప్రజల్ని హింసించడం, స్త్రీలను మాన భంగం చేయడం, గృహదహనాలు కావించడం యిందులో వర్ణితాలు. చివరకు ప్రజా ఉద్యమంలో రజాకార్లు, నిజాం పాలకులు కనుమరుగై, భూస్వామ్య వ్యవస్థ పతనమై ప్రజా ఉద్యమం విజయం సాధించడం ఈ కథా కావ్యంలో పేర్కొన బడింది.

నవాబు పాలనను వ్యతిరేకిస్తూ కుందుర్తి ప్రస్తావనలో యిలా అన్నాడు.—

'ఒక రాజు మొగాన్నే ప్రొద్దు పొడిచిందా?
దేశంలో
ప్రతిరాజు కటిక గుండెలో
పొంగిన అధర్మపు టావేశంతో
పరిపాలన సాగింది';

హైదరాబాదు సంస్థానాన్ని గూర్చి;

'దేశంలోని సంస్థానాలన్నిటిలో
హైదరాబాదు పెద్దది
భూస్వామికం బాధల్ని ప్రజలు సహించిన
చిట్టచివరి హద్దు అది: (సింహాసన)

"మన దేశం కడుపులో పుట్టిందొకమహావ్రణం
ఎప్పుడు మరిదాని శస్త్రచికిత్సకు తరుణం"

అన్న కుందుర్తి మాటలు, హైదరా బాదు సంస్థానపతనాన్ని కోరుతున్నాయని వ్యక్త మౌతుంది.

నిజాం దుశ్చర్యల్ని కుందుర్తి యిలా వివరిం చారు.

'ఒక రైతు పొలం పోయి యిల్లు చేరుకునే
సరికి
ఏలిన దొరవారి ఘనమైన సేవకులు వచ్చి
పెళ్లాన్ని జప్తు చేశారు—(బీజోత్పన్న).

'ఒక కూలివాణ్ణి నెలరోజులు వెట్టికి
దొరగారు ఆజ్ఞాపించారు...
జ్వరం తగిలి చివరిరోజు రాలేదని...
అతడి యిల్లు కాల్పించాడు'—(బీజోత్పన్న).

ప్రజాఉద్యమాన్ని గూర్చి కుందుర్తి ఇలా అన్నాడు.

'అడ్డంకులుగా కట్టిన ఆనకట్ట లాపలేవు
హడావిడిగ పరువెత్తిన ఫైరింజను లార్పలేవు
ఒక్కమనిషి నిద్రలేచి లక్షమందిని లేపుతాడు
ఒక్క అణువు కడుపుపగిలి మహాశక్తి జని
స్తుంది—(బీజోత్పన్న)

నిజాం పరిపాలనలో వెట్టిచాకిరీ ఎంతచేసినా పొట్ట నిండలేదనీ,' 'పండిన గింజలు పన్నుకు'

పోయి 'పస్తులు' మిగిలాయట. 'అరుగాలము కష్ట పడిన' వారు 'అవురుమని యేడ్చా'రట.

కమ్యూనిస్టు పార్టీ కార్యకలాపాల్ని కవి,

'పటేలు చిట్టాలో పొలం నెంబర్లు
స్వయంవరం చాటుకున్నై
మాకు ప్రవేశం లేదు
సంఘం సూర్యుడు
సభల ఉపన్యాసాల మధ్యాహ్నాల్లో
మరీ ఎండకాస్తున్నాడు దొరా'—(రాయబార)

అని వివరించాడు.

నాటి పోలీసుల దమనకాండను స్త్రీల దుస్థితిని కుందుర్తి వివరించిన తీరు హృదయ విదారకంగా వుంది. (మానభంగం లో)

'విచ్చలవిడిగా తిరిగే ఆబోతు, ఏచేలో మేసినా ఏమనం మనం'. 'పుట్టింటికి పోయిన పెళ్లాన్ని, మళ్ళీ కళ్ళారాచూసిందాకా నమ్మకం లేదు.'

'పదహారేళ్ళ పసుపు చీరపమిట చెంగుమీద
ప్రశ్నలదారాలు లాగుతున్నాడు పోలీసు
అధికారి '
'ఆ యువతి', కీళ్ళమీద లాటీలతో కొట్టటం
మొదలెట్టారు,
పోలీసులు బూట్లతో మొట్టటం మొదలెట్టారు...
'గుడిసెముందు అధికారి యువతిని చెరిచాడు
పదహారేండ్ల మానవతి శీలాన్ని కరిచాడు,
'ఆ అమ్మాయి ఉదయం ఆరుగంటలకు
చచ్చిపోయింది.'

గెరిల్లా పోరాటంలో పతనమౌతున్న బూర్జువా వ్యవస్థ స్థితిని కుందుర్తి,

గ్రామంలో పాతరాజుల ఫర్మానాలు పలకటం
లేదు.
మూగబోయిన రాచరికాల గొంతులు
పాడేపాటలకు ప్రజలు ఉలకటం లేదు
ఆదుకొనేవారు అనుకున్నవారికి
తంతులమీద తంతులు'- (భూమిదాన)

అని వివరిస్తాడు.

రజాకార్ల పరిస్థితిని,

'రానురాను మాత్రం గొంతులో ఉండ
మింగుడు పడలేదు'
'పరుగెత్తలేని రజాకార్లు
ఆ మంటల్లోపడి అసువులువిడిచారు-(రజాకార)
'గాలిమేడలు కూలిపోయినై
ప్రతిఘటన నీటిబుడగలా పగిలింది
రజాకార్లు పఠించడానికి యిక
పలాయన మంత్రం ఒక్కటే మిగిలింది'
—(దండయాత్ర)

భూస్వామ్య పతనాన్ని, ప్రజా స్వామ్య విజయాన్ని కుందుర్తి,

'అడివంతా అల్లకల్లోలం చేసిన
మత్తగజం లొంగింది
ఒకజాతి ప్రతిష్ఠావాహిని
గట్లుత్రెంచుకు పొంగింది
నవాబు తల నేలకు వంగింది'—(దండయాత్ర)

అని పేర్కొన్నాడు. కుందుర్తి 'తెలంగాణ' కథాకావ్యాన్ని 'నిజం జయిస్తుంది, ధర్మం జయిస్తుంది, వెలుగు జయిస్తుంది, తెలుగు జయిస్తుంది' —(ఉపసంహార) అని ముగించాడు.

ఈ విధంగా, కుందుర్తి జీవితాన్ని, రచనల్ని, వచన కథాకావ్యమైన 'తెలంగాణ' ను సమీక్షించడమైనది. కుందుర్తి చిరస్మరణీయుడు'.

# సాహితీ సేవకుడు ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్

మధ్వాచారి రామకిషన్

బ్రౌను దొర క్రీ.శ. 1769 లో కలకత్తా నగరములో జన్మించెను. ఈతడు ఆంధ్రభాషకు అపారమైన సేవ చేసెను. ఇతని తండ్రియగు డేవిడ్ బ్రౌన్ కలకత్తా నగరమున చర్చి ఉద్యోగిగా ఉండెను. తల్లిపేరు కన్యానామ మిస్ కౌలే, తండ్రి ప్రోత్సాహము వలన ఇతడు బాల్యముననే హీబ్రూ, అరబ్బీ, గ్రీక్, లాటిన్, హిందుస్థానీ భాషలను నేర్చుకొనెను తండ్రి చనిపోయిన తర్వాత తన పదునాల్గవ ఏట భారత దేశము వీడి విద్యాభ్యాసమునకు ఇంగ్లాండుకు పోయెను, అక్కడ 5 సంవత్సరములు చదువు గడిపి 1817 లో మద్రాసుకు వచ్చెను. అంతవరకు అతనికి తెలుగు భాష ఒకటి ఉన్నదని కూడా తెలియదు. ఇది అతని జీవితములో మొదటి దశ.

బ్రౌన్ దొరను 1820 ఆగస్టులో కడప కలెక్టరునకు అసిస్టెంటుగా నియమించారు. ఆనాటి నుండి ఆయన అక్కడ ఉద్యోగ రీత్యా లేకపోయినా, కడప బ్రౌన్ దొరకు కార్యరంగం అయింది. ఉద్యోగంలో చేరిన తరువాత కొన్ని సంవత్సరాలకు బ్రౌన్ దొర కడపలో ఇల్లుకొని, మోటబావి మొదలైన వాటిని ఏర్పరిచి వాసయోగ్యంగా చేశాడు. అటుతోట, ఇంటిలో ఒక ప్రక్క పాఠశాల, తన లైబ్రరీ మొదలైనవే గాక తన పండితులకు, వ్యాసగాంధ్రకు వసతులు కల్పించెను. అంటే తెలుగు కావ్యాల పరిష్కరణ శుద్ధ ప్రతుల్ని సిద్ధం చేయించడం, పండితుల చేత కావ్యాలకు వ్యాఖ్యానాలు వ్రాయించడం మొదలైన కృషిని కూడా చేయిస్తూ ఉండేవారు. కడపలో ఉద్యోగంలో చేరిన క్రొత్తలో ఆ జిల్లా కలెక్టర్ 'హన బరీ', తెలుగు బాగా మాట్లాడటం చూచి ఆశ్చర్య పడ్డాడు. బ్రౌన్ దొర తెలుగు అలా మాట్లాడ గలనా అని అనుకొనేవాడు. రెండు సంవత్సరములలో తెలుగు భాష మాట్లాడటం వచ్చింది కాని, సాహిత్యజ్ఞానం, విశేషంగా కలుగలేదు. ఆయన ఉద్యోగ జీవితంలో పెద్దగా నేర్చుకోవలసిన విశేషా లేమి లేవని చెప్పాలి 1834 లో మొదటి సారి మూడు సంవత్సరాలు సెలవు మీద ఇంగ్లాండు వెళ్ళేదాకా తెలుగు దేశంలో వివిధ ప్రాంతాలలో చాలా ఉద్యోగాలు—రెవెన్యూ జ్యూడీషియల్, పోలీస్, కస్టమ్స్, శాఖలలో పని చేశారు.

బ్రౌన్‌దొర భాషాసేవ స్థూలంగా నాలుగు ముఖ్య భాగాలుగా విభజింప వచ్చును. దానిలో మొదటిది గ్రంథ సేకర, సంస్కరణ, ముద్రణ. రెండవది వ్యాకరణ రచన, మూడవది నిఘంటు

నిర్మాణం నాలుగవది లఘురచనలు, ఇవన్నీ నేటికి మనం గౌరవించవలసినవే. మన తెలుగు పద్య కావ్యాలలో 'వేమన పద్యాలు' బ్రౌన్‌దొరను బాగా ఆకర్షించాయి.

'హిందువుల ఆచార వ్యవహారాలు' అనే పుస్తకం ద్వారా వేమన పేరు బ్రౌన్ దొర వినటం తటస్థించింది. 1824 లో వ్రాత ప్రతులు తెప్పించి వేమన పద్యాల్ని చదవడం ప్రారంభించాడు. దొరికిన పద్యాలలో మంచి వాటిని తన ఇంగ్లీషు అనువాదంలో 1829 సం॥లో మద్రాసులో ప్రచురించాడు. పిమ్మట ప్రపంచపు వెలుగు చూడక తాళ పత్రములలో దాగియున్న రసవంతములగు తెలుగు కావ్యములను ముద్రణ భాగ్యమునకు నోచుకొనునట్లు చేసెను. ఈ కృషిలో ఆయనకు సాయపడిన పండితులు ఏలూరు అయ్యప్ప, రావిపాటి గురుమూర్తి మొదలగువారు.

వసు చరిత్రను 1844 లోను మను చరిత్రను 1851 లో అచ్చువేయించాడు. అతడు తెలుగు నేర్చుకొనగోరు పాశ్చాత్యులకును, ఇంగ్లీషు అభ్యసింపగోరు తెలుగు వారికి ఉపయోగ పడునట్లు పలు నిఘంటువులను కూర్చెను. 1827 లో బైచరాజు వెంగళరాజు, పంచతంత్రాన్ని, వైజయంతి విలాసాన్ని, వ్యాఖ్యానంతో కలిపి 1849 లో ముద్రించినాడు. కళాపూర్ణోదయము, తారాశశాంక విజయము, విజయ విలాసాది ప్రబంధాలు ఆయనకృషి వల్లనే వెలుగులోనికి వచ్చాయి.

బ్రౌన్ దొర ప్రకటించిన గ్రంథం 'తాతాచారి కథలు' ఈ తాతాచారి నెల్లూరుకు చెందినవాడు. బ్రౌన్ దొరకు ఆశ్రితుడు. కావ్య తర్క, వ్యాకరణాలు, చదువుకొన్నవాడు. 1855 సం॥లో స్వదేశమైన ఇంగ్లాండుకు పోయెను; అచటకూడ ఆంధ్ర భాషకు ఎనలేని సేవ చేసెను. తెలుగు వ్యాకరణ ప్రథమ ముద్రణ 1840లో జరిగింది. ద్వితీయ ముద్రణ ఆయన మనదేశం విడిచి పోయిన తరువాత 1857 లో జరిగింది. 'బ్రౌణ్య తెలుగు, నిఘంటువు (తెలుగు-ఇంగ్లీష్),' 'బ్రౌణ్య ఇంగ్లీష్' నిఘంటువు (ఇంగ్లీషు-తెలుగు) అను రెండు నిఘంటువులు మద్రాసులో 1852 సం॥లో అచ్చయ్యాయి.

బ్రౌన్ దొర ఆరోగ్యం మంచిది. మొదట్లో మద్యపానం, వేట, మొదలైన వ్యసనాలు కొంచెం ఎక్కువగా ఉన్నా క్రమంగా అన్నింటిని మానివేసి వయస్సు వస్తున్న కొలదీ ఆరోగ్యాన్ని బాగా కాపాడు కొన్నాడు. 40 ఏండ్లు నిండే దాకా బైరన్ పోప్, స్విఫ్ట్, మొదలైన ఆంగ్ల కవుల్ని అనుకరించి ఇంగ్లీషు పద్యాలు వ్రాసేవాడు. బ్రౌన్ దొర లండన్ వెళ్ళిన తరువాత అక్కడ తెలుగునకు విశిష్ట స్థాన లభించింది. ఆనాటి ఇంగ్లండులో బ్రౌన్ దొరను మించిన తెలుగు పండితులు లేరు. ఇందు వల్ల ఆయన 1865 లో లండన్ విశ్వవిద్యాలయంలో తెలుగునకు ఆచార్యునిగా, నియుక్తుడయ్యాడు. అక్కడ ఒక తెలుగు కోర్సును ఏర్పాటు చేశాడు.

ఖండాంతరాలలో తెలుగు భాషా సాహిత్యాలకు గౌరవ స్థానాన్ని తెచ్చి పెట్టిన వారిలో బ్రౌన్ దొర విశిష్టుడు. పెద్ద యెత్తున కృషి చేసిన వారిలో ప్రథముడన్నను సత్యదూరం కాదు. లండన్‌వెళ్ళిన తరువాత ఇంకో 30 ఏండ్లు తెలుగుభాషా సేవ చేసెను. బ్రౌన్ ఆంధ్రకవులకు, ఆంధ్ర పండితులకు, నూర్లు, వేలు రూపాయలను దాన మొసంగెను. అనేక మంది పండిత కవులను సత్కరించి వారి పొగడ్తలను పొందెను. అలాంటి బ్రౌన్ అపారమైన సాహిత్య సేవచేసి 1884 డిశంబర్ 12 తేదీన కీర్తిశేషుడయ్యాడు. తెలుగుభాష యున్నంత కాలము బ్రౌన్ దొరను మరువలేము.

# ఇస్మాయిల్ కవిత్వం

శివలింగం

చెట్టు బతుక్కి ఒక గొప్ప ఆదర్శంగా కని పిస్తుంది. విత్తు నుంచి మొక్క మొలిచి కొమ్మలు రెమ్మలు తొడిగి విశాలంగా విస్తరించి నేలసారాన్ని పీల్చుకుంటూ నింగిలోకి ఎదిగి నీడల విసనకర్ర విప్పి ఎంతో సేద తీరుస్తూ ఏమీ ఆశించకుండా పూలు పళ్ళు యిస్తుంది.

పురుగు సగం సగం పిట్ట
ధరను చొచ్చి దివిని విచ్చి
విరులు తాల్చు తరువు.

స్థిరమైన పునాది ఎగిరే స్వేచ్ఛ రెండూ వుండటం వల్లనే విరులు తాల్చింది. అందుకనే ఆదర్శమైందంటారు ఇస్మాయిల్. పదచిత్రాలతో భావాన్ని మాటు పరిచి నిర్మాణ దక్షతను చూపు తుంది కవిత్వం. తిలక్‌ది అనుభూతి కవిత్వం. శేషేంద్రది ప్రతీకాత్మక కవిత్వం. ఈ రెండు ధోరణులూ వేగుంట కవితల్లో కనిపిస్తాయి.

చెట్టు నా ఆదర్శంలో జీవన వృక్షం ప్రత్యక్ష మైంది. 'మృత్యు వృక్షం భయంకరమైన తల కిందుల చెట్టు. అది అకస్మాత్తుగా మొలిచి జ్ఞాపకాల కొమ్మల్ని గాఢానురాగాల ఊడల్ని వెనక్కి పీల్చేసు కుంటుంది. చిలుకలు వాలిన చెట్టు కవిత్వానికి ప్రతీక. మంచి కవిత్వంలో నవనవోన్మేషమైన ఎర్రటి చిలుక ముక్కుల్లా చూసే కొద్దీ కొత్త అర్థాలు స్ఫురిస్తూనే వుంటాయట. ఇస్మాయిల్‌కు శక్తీ, అభ్యాసము పుష్కలం అంతేకాదు శక్తికి తోడు. లోక శాస్త్ర కావ్యాదుల పరిశీలనా నిపుణతా, ఆధునిక కావ్య పఠనా అతని కవిత్వానికి జీవమూ జవమూ ప్రసాదించాయి. కవిత్వంలో వస్తువు కన్నా భావానిదే పై చేయి. వస్తువుకు ప్రాధాన్యమిచ్చిన కవిత్వం నిర్జీవం. మనిషి మనిషిని బంధించేది మనీష. మనిషికి వుండాల్సింది స్ఫుటంగా తీక్షణంగా వీక్షించే సూర్యనేత్రం. స్వేచ్ఛ వుండాలి. ప్రేమ వుండాలి. ఆనందం వుండాలి. ప్రకృతిలోని వస్తువుల్ని యథాతథంగా పదచిత్రాల్లో చూపితే కవిత్వం పేలవంగా వుంటుంది. ఇస్మాయిల్ కవి త్వంలో జడ ప్రకృతి చైతన్యవంతమై మన కళ్ళ ముందు నాట్యం చేస్తుంది. ఈ గుణం రవీంద్రుని కవిత్వంలో ఎల్లెడలా దర్శనమిస్తుంది. టాగూరంటే, ఇస్మాయిల్‌కి యిష్టం, 'బోటులో టాగూర్' కవిత, కవిత్వంలో నిశ్శబ్దంలో 'సదా బాలకుడు టాగూర్' వ్యాసం రాశాడు. వచన కవిత్వపు అందాల్ని దోచు కున్నాడు. పాటలోకి వెళితే పక్కదారి పట్టినట్టే. ఛందస్సులో బిగిస్తే వెనక చూపే. ఆకలి కేకల కోసం వెతికితే అడియాసే. విప్లవజ్వాలలు రగిలి ఉవ్వెత్తుగా లేచి యువతరాన్ని ముంచెత్తుతుంటే ఇంకా ఏం ప్రేమగీతాలండీ అంటారు.

ఏకైక మహాప్రేమ
ఒక్కొక్క జీవితపు ని

సర్గాన్ని మహానదిలా
శాసిసుంది,

(పే. 27)

బుద్ధిగా ప్రేమించుకోక
యుద్ధాలెందుకు చేస్తారో
నా కరం కాదు

(పే. 26)

వేయి పిర్రల సముద్రం (పే.89) ప్రేమగీతం స్మైల్‌కి యిష్టమట. భావకవితాఛాయ కనిపించదు. ఆధునికత మీకు కనిపించ లేదంటే అసలు ప్రేమంటే మీకు పడదు. అనుభవం (పే 111) కవితలో పూర్వానుభవాల్నించి నేర్చుకున్నారని పూడిపోయిన పురాతనాస్థికల్ని తవ్వి తీసుకొచ్చి ఎముకల్ని పేరిస్తే ఎవ్వరూ ఎప్పుడూ చూడని వింత జంతువొకటి అంతిమ రూపం దాల్చింది. ఈ జాతి అంతమై అయిదు లక్షలేళ్ళయింది. తనకు ముందున్న కవిత్వాన్ని చదవకుండా ఏ కవీ ఆకాశాన్నుంచి వూడి పడడు. పాత కొత్తల మేలు కలయికను గురజాడ వాంఛించాడు. ఏ శాస్త్రంలోనైనా కవిత్వంలోనైనా ఏ కాలంలోనైనా సజీవ నిర్జీవ పదార్థాలుంటాయి. తరువాత తరంవారు నిర్జీవ పదార్థాన్ని వదలి ప్రాణ పదార్థాన్ని స్వీకరిస్తారు. పునరుద్ధరణవాదుల మీద జోక్. సంస్కరణ వాదం మేలు. మానవ జీవిత ప్రతిబింబాలనదగిన ప్రకృతి వర్ణనలు ఋగ్వేదంలో వాల్మీకి కాళిదాసాదులలో వున్నాయనే అంటారు. ఆధునిక కవిత్వంలో పద్యానికి పద్యానికి లేదా పద్య మొత్తానికి అర్థాన్ని నిర్ణయించడం కష్టం. శాబ్దిక బోధ చెప్పాలి. కవికి కూడా ఇది అర్థమని చెప్పే అధికారం లేదు. పాఠకుడి మేధస్సుతో ఆలోచించాలి, అందుకే ఆలోచనామృతం అన్నారు. వైదిక కవిత్వాన్ని పునః ప్రతిష్ఠించాలనుకోవడం వెర్రి. మార్క్సిస్టు కవిత్వమే కవిత్వం కాదేదీ కవిత్వం అనుకోవడం అవివేకం.

ఇస్మాయిల్ అశ్లీల కవితలు కూడా రాశాడనే నింద వుంది. శ్లీలంగా అర్థం చేసుకోకుండా మరొక విధంగాను అర్థం చేసుకోవచ్చు. ఉదాహరణ 'నువ్వు' కవితను తీసుకోండి. నీకు నాకు మధ్య లోకమే అడ్డు. నీ మీద కోపం లేదు. ప్రపంచాన్ని చింపి పోగులు పెడతాడట. శరీరం ధరించడమే ప్రపంచం దానివి గావడం.

కవితా వలయం విశాలం గదా మరి. మా ఆవిడ, మా మనవడు, మనవరాలు వంటి సంకుచితాలకు ప్రాధాన్యత నిచ్చారెందు కంటే కొంత అద్దమందు కొంచెమై వుండదా అన్నారు. మా ఆవిడ కవితను చదివితే తెలుస్తుంది.

అష్టదిక్కులా చేతుల్తో
ఆకులతో చక్రమై
జీవితబ్బండిని
ఠీవిగా నడిపిస్తుంది

ఒకచేత్తో ఆకాశాన్ని ఎత్తిపట్టుకుని ఒక చేత్తో భూమిని బుజ్జగిస్తూ విశ్వమంతా విశాలంగా పరచుకుని కనిపించడం లేదూ!

గతి తార్కిక భౌతికవాదం, అర్థికం ఒక్కటే ఏకైక సర్వరోగ నివారిణిగా భావిస్తారు మార్క్సిస్టులు. కాడ్వెల్ వంటివారిలో పిడివాదం లేదు. అసలు మార్క్సులోనే లేదు. వైయక్తికత జంగ్ మనస్తత్వశాస్త్ర మార్గమే కాదు మార్క్సు దృక్పథం కూడా. సామ్యవాద విప్లవం అంతిమ లక్ష్యం. వైయక్తీకరణ (Inidviduation). బూర్జువా వ్యవస్థలో వ్యక్తి పరిపూర్ణ వికాసం పొందడంలేదు. భవిష్యద్వర్గ రహిత సమాజంలో వ్యక్తి పూర్ణ వికాసం పొందడంద్వారా మొత్తం సమాజాన్ని సుసంపన్నం చేయగలుగుతాడు. ఆదర్శ సామ్రాజ్యాలను ఊహాజనితాలని ఖండించిన మార్క్సు

ఎంగెల్స్‌లు వారొక ఊహాసామ్రాజ్యాన్ని నిర్మించారు. జ్ఞాన కాసారంలో విరిసిన ప్రేమ పద్మంలా ఈ ప్రపంచం వుండాలనుకుంటాం. మార్క్సిజానికి ఆచరణరూపం కమ్యూనిజం కమ్యూనిజం లోకానికి భయంకర వదనాన్ని చూపింది. రష్యా ఒకనాడు భూతలస్వర్గం అనుకున్నది తరవాత భూతాలస్వర్గం అయింది. ఈనాడు కమ్యూనిస్టు కోటలన్నీ బద్దలైనాయి. కవులు ఒక సంకుచిత రాజకీయ సిద్ధాంతానికి బానిసకారాదు. బానిస అయితే కవిత్వం చచ్చినట్టే. పేద ప్రజలమీద అభిమానం వుంది. అందుకు మార్క్సిజం రంగు వేసుకోనక్కరలేదు. ఉత్తమ కవిత్వం నీటిబుగ్గలా తన్నుకు వస్తుంది నీలో కవితా శక్తి వుంటే. మార్క్సిజం ఒక **Philosophical system** గా చరిత్రలో నిలిచిపోతుంది. మన తెలుగుకవులు విమర్శకులు కూపస్థ మండూకాల్లా, నూతిలో తాబేలులా దానికే మొక్కుతుంటారు. వ్యవస్థను నాశనం చేయాలంటూనే మరొక వ్యవస్థకు ఎందుకు పట్టం కట్టాలి. మార్క్స్ ఎంత విశాల దృక్పథంతో సాహిత్యాన్ని పఠించాడో తెలియంది కాదు. ఇస్మాయిల్ రాసిన కవితలుగాని, వ్యాసాలుగాని మార్క్సిస్టులకు కనువిప్పు కలిగించాలనే వుద్దేశ్యంతో రాసినవే. నీలో ద్వేషాలు కోపాలు రోషాలు వున్నట్టే ఇతరుల్లోనూ వుంటాయి. నీవెంతో వాడూ అంతే. నీలో అవిపోతే ఇతరుల్లో పోగొడతావు. లేనిదాన్ని విమర్శించడం కాదు. ఉన్నది ఎలా వుందో చెప్పాలి.

మార్క్సిజానికి ఏనాడో కాలం చెల్లిపోయింది. 1956లో కృశ్చేవ్ 20వ కమ్యూనిస్టు మహాసభలో బయటపెట్టిన రహస్యనివేదకతో కమ్యూనిజం నిజ స్వరూపం ప్రపంచానికి తెలిసింది. ప్రముఖ రచయితలు మేధావులు కమ్యూనిజాన్ని వదలేశారు. హోవార్డుఫాస్ట్ 'ద్ నేకెడ్ గాడ్' ఆండ్రీజీడ్, రిచర్డు రైట్. ఆర్థర్‌కోస్లర్, స్టీఫెన్‌స్పెండరు, ఇగ్నే షియా సైలోన్, లూయిస్ ఫిషర్- ఈ ఆరుగురు రచయితలు రాసిన **God that Failed** జాన్‌స్ట్రాచీ **'Strauggled cry'**వంటి గ్రంథాలు ఆ సందర్భంగా రాసినవే. గొప్ప సంచలనం కలిగించాయి. మార్క్సిస్టు మేధావివర్గంలో మిలోవాన్ జిలాస్ రాసిన 'న్యూక్లాస్' వచ్చేవరకు కమ్యూనిస్టు దేశాల్లో నవ్యధనిక వర్గం ఒకటి తయారయిందని తెలియదు. రచయితలు మార్క్సిస్టు దృక్పథానికి, కమ్యూనిజానికి విధేయులుగా వుండాలనడం ప్రచారకవిత్వం రాయాలని ఆదేశించడం పలువురికి బాధ కలిగించింది. ఇస్మాయిల్ 'పార్టీగా మహాసభ'లో చెప్పింది అదే. మార్క్సిస్టుకవులు విమర్శకులు కోరేదేమిటంటే వారికి తప్ప ఇతరులకు స్వాతంత్ర్యం వుండకూడదు. వాళ్ళు అందర్నీ వారు చెప్పినట్టు రాయని వారినీ విమర్శించవచ్చు. మానవులుగా మార్క్సిస్టుకు ఎంత కోపం వుంటుందో ఎదుటివాడికి అంతే వుంటుందన్న ఆలోచన రాదేమిటో. ఇంకా ఎక్కడి మార్క్సిజం. ప్రాచీన సంప్రదాయాన్ని, బూజు పట్టిన మార్క్సిజాన్ని వదలనంత కాలం అజ్ఞానం లోంచి బయటికి రానట్టే. ప్రపంచమే ముందుకు దాటుకుపోతుంది.

తదారిపోయిన
ఎడారి ఇసకలో
ఒత్తిగిలి పడుకున్న
నత్తగుల్లవి
నీ మార్క్సిజం మహా సముద్రం
నిన్ను విడిచి ఎన్నడో ఇంకిపోయింది !
నీ చెవిలోని హోరు
ఇంకా అదే ననుకుంటున్నావు.

ఇస్మాయిల్‌కు మార్క్స్‌తో పేచీ లేదు. మార్క్సిస్టులతోనే పేచీ. ప్రపంచంలోని ఆధునిక

తాత్విక ధోరణులను అధ్యయనం చేశాడు. సార గ్రహణం చేసి సాగిపోవాలంటాడు. ఈనాడు రాస్తున్న కవుల్లో మార్క్సిజం భక్తిభావం కని పించక పోవడం గమనించదగిన పరిణామం. పికాసో మార్క్సిస్టు అయినా దానికి దాసోహమన లేదు. స్వేచ్ఛను ప్రసాదించాడు. పికాసో తన కళ ద్వారా స్వేచ్ఛను అందించాడు.

మన కళ్ళ మీది కటకటాల్ని
కుంచెతో చెరిపేశాడు
అప్పట్నించీ మనకళ్ళు
ఎగరటం నేర్చుకున్నాయి.

'గాడిదస్వామ్యం' భారత ప్రజాస్వామ్యం మీద రాసినసెటైర్. 'ఈవిడ'(పే.134)కవితలో దేశభక్తి కోసం త్యాగం చేశారు. స్వాతంత్ర్యానంతరం స్వార్థం కోసం దేశాన్నే తగలేశారని చెప్పారు. చిత్రకారుడు వాన్‌గో మీద రాసిన కవితలో శ్రవ్య కళను కాక దృశ్యకళకు యిచ్చిన ప్రాధాన్యతను చిత్రకళౌన్నత్యాన్ని చెప్పారు. వాన్‌గో చిత్ర కళ మీద శిలువ వేయబడ్డాడు. ప్రజల్ని ప్రేమించడం కన్నా కళాత్మకమైంది మరొకటి లేదన్నాడువాన్‌గో. **True Poetry can exist only if there is a variety of views and tastes.**

చిలకలు వాలిన చెట్టు మీద వాటి ముక్కుల దీప శిఖల వల్ల ఒక్కొక్క చిలకనే పోలుస్తుంటారు. ఏక రీతి విసుగు పుట్టిస్తుంది. జీవితంలోను. జగత్తులోను. అందరూ ఒకే రీతిగా రాస్తే అంతేగా. అందుకే ఇన్ని వైవిధ్యాలు, ఇన్ని కొత్త గొంతులు, మధుర గీతాలు, విషాదగీతాలు, కవిత్వంలో నైతిక మానసిక సత్యాలు, అంతర్దృష్టి. (**Moral and Psychological truths**) ఎంత గాఢంగా వుంటే అంతగొప్ప కవిత్వం వెలువడుతుంది. అది ఎంతో విలువైంది. తిలక్ అంతరాంతర జ్యోతి స్సీమల్ని బహిర్గతం చెయ్యాలన్నాడు. ఒకచోట ఇస్మాయిల్ అంటాడు.

పద్యాన్ని లోతుగా తవ్వుతున్నాడుకవి
టన్నుల కొద్దీ మన్ను కింద
టన్నుల కొద్దీ మనసు కింద
కప్పబడి వుంది పద్యం.

(పే. 205)

మిస్టిసిజం నచ్చకపోయినా టాగోర్‌ని, జీబ్రాన్‌ని మెచ్చుకున్నాడు. ఇంద్రియ సుఖాలు, ఆధ్యాత్మికానందాలు అనేవి విడదీయడానికి వీల్లేని సంక్లిష్ట అనుభవాలు. యౌవనంలో చలంగారు అన్వేషించిన ఆనందానికి వృద్ధాప్యంలో ఆరాటపడిన దానికి ఆట్టే భేదం కనిపించదు. 'తెలుసుకున్న జ్ఞానికి గంగంతా సారాయే' అన్నాడు బైరాగి అంటాడు ఇస్మాయిల్. లోకంలో ప్రేమ చచ్చి పోయిందని దాన్ని తిరిగి సృష్టించుకోవాలని ప్రతి వ్యక్తి తన ప్రేమ పరిధిని విస్తరించుకుంటూపోతే చివరికి అన్ని పరిధులు కలిసిపోయి ఒక మహా వలయంఏర్పడుతుందని అది వ్యక్తులతోప్రారంభం కావాలిగాని మూకలతో కాదని అంతవరకు ప్రపంచానికి మోక్షంలేదని చెపుతారు. ఫ్రెంచి కవి రేబో 'ప్రేమని పునః సృష్టించాలి' (**Love must be invend**) అన్నాడని ఉదాహరిస్తాడు.

వేగుంట మోహన ప్రసాద్ కవిత్వంలో వుండి అస్పష్టతకాదు సంక్లిష్టత అంటారు. కవిత్వం అనేక అర్థాల నీడల్ని పరుస్తుంది. ప్రతి కవితలోను దిగే కొద్దీ లోతులు తగుల్తుంటాయి దీనినే **ambiguity** అంటారు. ఇది కవిత్వానికి ప్రాణం. ఈ మాటలు ఇస్మాయిల్ కవిత్వానికి పూర్తిగా వర్తిస్తాయి. ఇస్మాయిల్ కవిత్వం చదువుతున్న కొద్దీ కొత్త కొత్త

అర్థాలు స్ఫురిస్తాయి. అందమైన పదాలను పొందికగా కవిత్వంలో పొదిగితే ముందు అర్థం కాకపోయినా ఆనందం కలిగిస్తుంది. ఆలోచించిన కొద్దీ కొత్త అర్థాలు స్ఫురించి లేక తళుక్కున మెరిసి కవిత్వం ఆలోచనామృతంగా మారుతుంది. రాళ్ళవంటి బతుకులులకు సెలయేటి పాట కవిత్వం.

బాల్యం ఎంతఆనందమయంగా గడిచిపోయిందో కన్నులకు కట్టినట్లు వర్ణిస్తారు. కృష్ణశాస్త్రిగారి పాటలు స్వర్గద్వారపు తలుపులు తెరచాయి. శ్రీశ్రీ కవిత్వంలో లోకద్వారపు తలుపులుతెరచాడు చలం, కుటుంబరావుల తుఫానుహోరు విన్నాడు. టాగూర్, జయదేవుడు, సూఫీ కవులు ఆంగ్లంలో ఆడెన్ స్పెండర్ డేలూయీ మెక్‌నీస్‌లు, ఫ్రెంచి సిబాలిస్టు కవులు, లోర్కావంటి స్పానిష్‌కవులు, రిల్కేవంటి జర్మన్‌కవులు ఎందరెందరో అంతర్జాతీయ కవుల కవిత్వాన్ని అధ్యయనం చేశాడు. ఇంతగా అధ్యయనం చేసిన కవులుగాని, విమర్శకులు గాని తక్కువే మన తెలుగునేలలో. రావిశాస్త్రి గారి మార్క్సిస్టుల్లో మహాత్ముడన్నాడు. ఇస్మాయిల్ అజ్ఞేయవాది (ఎగ్నాస్టిక్) అయినా అన్ని కవిత్వాల్నీ ఆస్వాదించే సహృదయత కలవాడు. చక్కని వచనం రాయగలరనడానికి 'కవిత్వంలోనిశ్శబ్దం' ఉదాహరణ.

ఇస్మాయిల్ గురించి పెన్నా శివరామకృష్ణ రాసిన గీతంతో ముగిస్తారు.

> ఆయనచేతిలో వున్నది ఉలి అంటారొకరు
> కుంచె అంటారు మరొకరు
> కాదు కలం అంటారు వేరొకరు.
> ఆయన చిరునవ్వు మనవైరితనాన్ని
> గుర్తుచేస్తుంది.

పుస్తక సమీక్ష

# విప్లవానికి పురిటిగది

'ఉత్తరం వెంటనే రాయాలనివుంది నాన్నా
కార్డు కొని తెచ్చుకోలేని స్థితినాది'

ఈరెండు పంక్తులు వందల పుటలు సాగే గాథల్ని చెబుతాయి అత్తవారింటికి వెళ్ళిన ఆడపిల్ల మనస్సు పొరల్లో దాగిన వేదనను శ్రీ అడిగోపుల వెంకటరత్నం రసార్ద్రంగా చిత్రించారు.

'పిరికితనం మనిషిని కౌగిలించుకొంటే
పగలు చీకటి అవుతుంది'—
అలారం
మరణమృదంగం అవుతుంది'

పదాలు సరళమైనవే. అవి అందించే భావాలు ఎంత నిశితంగా వున్నాయో చూడండి. ప్రతిభా

రచన : శ్రీ అడిగోపుల వెంకటరత్నం
పుటలు : 100, వెల : రూ 10/- లు
ప్రతులకు : రచయిత, నాగార్జున విశ్వ విద్యాలయం,
గుంటూరు-522 150

---

న్వితుడైన కవి మాటల్ని ఎలా వాడుకోగలుగుతాడో ఈ పంక్తులు నిరూపిస్తాయి.

ఈ సంపుటిలో వున్న 51 ఖండికలనుంచీ ఇలాంటి పంక్తులు ఉదాహరించవచ్చు' వ్యవస్థను పరిశీలించి, జనజీవన స్పందనను బాగా అర్థం చేసుకుని రాసిన కవితలివి. వస్తువైవిధ్యం కవి భావనా పటిమకు అద్దంపడుతుంది. ప్రతి కవితా ఆలోచింప చేసేదిగా వుంది. కవితాభిమానులు తప్పక చదవాల్సిన గ్రంథమిది. శ్రీ బాపు ముఖ చిత్రంతో దీనిని ఆకర్షణీయంగా తీర్చి దిద్దారు.

# పాండిచ్చేరి గీతాలు పన్నెండు

భారతీయ ఆధ్యాత్మికరంగంలో అరవింద తత్త్వానికి విలక్షణ స్థానముంది. దీనిపైన అసంఖ్యాకంగా గ్రంథాలు వెలువడ్డాయి. డా॥ సుప్రసన్న అందించిన ఈ పుస్తకంలో పన్నెండుగీతాలు చోటు చేసుకున్నాయి. రచయిత పాండిచ్చే . సందర్శించి ఆ అనుభూతిని అక్షరబద్ధం చేశారు అనుభవాన్నీ వేదాంత మర్మాలనీ గీతాలరూపంలో పాఠకుల ముందుంచారీ రచయిత. చాలవరకు ప్రతీకాత్మకంగా సాగుతుంది గీతరచన. ఉదాహరణకు-

'అదిగో ఈ రోడ్డుమీద కదలే అడుగుల పడగలు' ఈ పాదంలో రెండు ప్రతీకలున్నాయి.

రచన : డా॥ సుప్రసన్న
పుటలు : 22, వెల : రూ 1/-
ప్రచురణ : శ్రీ అరవిందకేంద్రం, నర్సంపేట, వరంగల్లు జిల్లా.

రోడ్డు సుషుమ్నా, పడగ కుండలినీ శక్తినీ సూచిస్తాయి. సాధకులు వీటిని గ్రహించగలుగుతారు. సామాన్య పాఠకుల కోసం రచయిత గ్రంథాంతంలో లఘువివరణ ఇచ్చారు. ఈ గీతాల్లో

నిక్షిప్తమైవున్న భావసంపదను ఇంకా ఎక్కువగా గ్రహించడానికి వీలుగా రచయిత మరింత విస్తృత వివరణ ఇచ్చివుంటే వుపయోగకరంగా వుండేది. ఏమైనప్పటికీ ఈ గీతాలు ముముక్షువుల్ని, ప్రత్యేకించి అరవిందుల అనుయాయుల్ని అలరిస్తాయి.

## తమసోమా జ్యోతిర్గమయ

భారతీయ జీవనవిధానంలో భక్తిభావం ముఖ్య భూమిక వహిస్తుంది. ప్రజానీకంలో ఈ గుణ విశేషాన్ని వర్ధిల్ల చేయడంలో ఎందరెందరో మహనీయులు దోహదం చేశారు.

శ్రీ రాచకొండ నరసింహ మూర్తి తనను వెంటా

రచన : శ్రీ రాచకొండ నరసింహమూర్తి
పుటలు : 33, వెల : రూ 3/-
ప్రచురణ : మాతృశ్రీ పబ్లికేషన్స్ ట్రస్ట్, బాపట్ల

డిన విచిత్ర వేదనను జిల్లెళ్ళమూడి 'అమ్మ'కు నివేదించుకుని ఊరట చెందారు.

ఈ పద్యాలు లోగడ 'మాతృశ్రీ' పత్రికలో ప్రచురితమయ్యాయి. ధారాశుద్ధి కొంత ప్రౌఢంగా వున్న ఈ పద్యాలు భక్తిభావబంధురాలు.

### శ్రీ జి. రామకృష్ణారావు

## విదుర

'ఊర్ధ్వబాహు ర్విదేమేష నచ కశ్చిచ్ఛృణోతి మామ్- (భగవాన్ వ్యాసః)'

వేద వ్యాసుల 'మహాభారతము' ప్రాచీన భారతీయ సంస్కృత వైభవములకు ప్రతీక. దీనిని ఇతిహాసమో కావ్యమో అనుటకు వీలులేదు. అందుకే మన ఆది కవి దీనిని 'ధర్మ తత్వజ్ఞులు ధర్మశాస్త్రంబని, యధ్యాత్మవిదులు వేదాన్తమని నీతి విచక్షణులు నీతి శాస్త్రంబని...' అద్వైత విభిన్న దృష్టికోణములతో ప్రస్తుతించిరి. మహాభారతమొక సరోవరమైన అందు వుద్యోగ పర్వకమల కర్ణిక ఈ 'విదురనీతి' మానవుని సాంఘిక, రాజ

1. విదుర నీతి : (మహా భారతాంతర్గతము) వెల 20/- 2. రచయిత్రి : శ్రీమతి డి. రాజేశ్వరమ్మ బి.ఎ; బి.ఇడి, 3. ప్రాప్తిస్థానము : వాణీ నిలయము, 11-12-3/1 రామిరెడ్డిపేట, నరసరావుపేట, 522 601.

నైతిక అంతస్సంఘర్షలకు నిలువుటద్దము విదుర నీతి. దైనందిన జీవిత సంగ్రామమునకిది దిక్సూచి.

అట్టి యీ విదుర నీతిని; సంస్కృతాంధ్రములలో సవ్యసాచి అనదగిన శ్రీమతి రాజేశ్వరమ్మ గారు సందర్భానుసారముగా స్మృతి ప్రమాణములతో చక్కగా ఆంధ్రీకరించి దైవవాణిలో విశేష అనుభవములేని తెలుగు మాత్రమే తెలిసిన వారికి యెనలేని సహాయ మొనర్చిరనుట అతిశయోక్తి కాజాలదు. సందర్భోచిత ప్రమాణమును చూపిన వీరి వ్యాఖ్యలో మచ్చునకు కొన్ని గమనించండి.

'శుభంకాయదివాపాపం—' (2అ.4 శ్లో॥ పేజి 37) శ్లోకమునకు 'నాపృష్టః కస్యచిత్ బ్రూయాత్, నచాన్యాయేన పృచ్ఛతః' అనియెడి స్మృతి వాక్యం వ్యాఘాతం కాదని నిరూపించుటలో సామాన్య. ఉత్తమ ధర్మాల మధ్యభేదం చక్కగా చూపిరి. అటులనే, 'అనుబంధా నపేక్షేత' (2-8-38 అనుదానిని "సహసా విదధీత..." అనియెడి భారవి శ్లోకం ఉదాహరణ చదవినపుడు

ధ్వనికామని 'సంవాసిన్యోహి మేధావినాం బుద్ధయః' ను స్ఫురింపజేయును; 'సహాదశ స్నానశీలం...' (5-31-118) అనువానిని ఆయుర్వేద సూక్తియగు 'స్నానంకం యనుస్వేద...'తో వివరించుట వలన వీరి ఆయుర్వేద శాస్త్ర పరిజ్ఞానము పరిగతమగు చున్నది.

తేట తెలుగులో సంస్కృత సంస్కృతీ పరిమళ మిశ్రిత యీ విదురనీతి పండిత పామర రంజకము మన్నన నొందదగినది.

కె. కె. ఆచార్య

# ఆత్మవేదం

పద్యంలో చెప్పినా గద్యంలో చెప్పినా వాక్యం రసాత్మకంగా ఉంటే చాలు, అది మహాకావ్య మవుతుందన్న ఆలంకారికుల అభిప్రాయాల కద్దం పడుతూ శ్రీ అష్టకాల నరసింహరామశర్మ గారు ఆత్మ వేదమనే కవితా సంహతిని రచించారు. ఈ సంకలనంలో ఛందోబద్ధమైన పద్యాలతో బాటు మాత్రాఛందంలో గేయాలు, మరికొన్ని వచన కవితలు గూడా చోటుచేసుకున్నాయి. భావనా బలంతో బాటు భాషమీద గూడా అధికారమున్నప్పుడు ఏమి చెప్పినా అందంగానే ఉంటుంది, ఇతివృత్త మేదైనా పాఠకుణ్ణి ఆకట్టుకుంటుంది. ఆంధ్రభాషకే అలంకార ప్రాయమైంది అవధాన ప్రక్రియ. శ్రీ అష్టకాల గారు అవధాన కళాప్రపూర్ణ బిరుదాంకితులు. అవధానంలో పట్టు దొరికిన వారికి సమయస్ఫూర్తి ఛందో బంధాల బిగువు సంప్రదాయ కవిత్వంలోని సొబగు కరతలామలకాలవుతాయి. కనుకనే అష్టకాల వారి వచన కవితకన్నా పద్యం ఒక ప్రత్యేకతను సంతరించుకుంది. వారి రచనలు చూస్తుంటే పద్యానికి మళ్ళీ పట్టాభిషేకం జరుగుతుందేమో అని పిస్తుంది. వచన కవిత పేరుతో కుప్పతెప్పలుగా విస్తరిస్తున్న కవితా ప్రపంచంలో కొత్త సంచలనాన్ని రేకెత్తించ గలవేమో అని తోస్తుంది.

ఆత్మవేదంలోని అనేక కవితలు కవి సమ్మేళనాలలో వినిపించబడినవే. శ్రోతల నూగించినవే చప్పట్లు చరిపించినవే, వాటికితోడు మరికొన్ని కవితల్ని జోడించి పుస్తక రూపంలో పాఠకలోకాని కందించిన అష్టకాలవారభినందనీయులు. పుస్తకాన్ని రచించడంతోబాటు ప్రచురించడంలో ఎన్ని కష్టనష్టా లున్నాయో అందరికీ తెలిసిందే కదా! కనుకనే వారు ఇష్టదేవతా ప్రార్థన చేస్తూ పద్దెము వ్రాయు కోర్కె బలవంతముగాగ రచించ బూనగా పెద్దలు మెచ్చగా వలయు పేర్మిని నీ పదు శక్తి చేతనే...కనవే నను పేర్మిని వాసవేశ్వరీ! అని విన్నవించుకున్నారు. తన కవితను పెద్దలు మెచ్చేలా అనుగ్రహించమనీ తన్ను పేర్మితో కనికరించమనీ నివేదించుకున్నారు. అంతేగాక పద్యం మీద తన కున్న మక్కువనుగూడ విశదీకరించారు. కవిగూడా సంఘజీవియే కనుక సామాజిక పరిస్థితులకు ప్రభావితుడు కాకుండా ఉండలేడు. తన పరిసర వాతావరణానికి ప్రతిస్పందించకుండా తప్పుకోలేడు. అందుచేత నే(సా)మాన్యుడు అనే కవితలో

తుంగచెట్టులా అన్నిటికీ
తలవంచే సామాన్యుడు
ఎన్నికల కాలంలో అందరికీ మాన్యుడు

అంటూ సామాన్య మానవుని దీనస్థితి కద్దం పడుతూ నేటిబీరవంటి ప్రజాస్వామ్యంలో ఆతడు అభిభూతుడు; అనుభూతుడు; పరాభూతుడు ; జగన్నాయకుం రథాలకతడే సూతుడు అని నిర్వచనం చెప్పారు శ్రీ అష్టకాలవారు.

అంతే గాక నేటి సమాజాన్ని పట్టి పీడిస్తున్న అంటు రోగాలలో వరకట్న మొకటి, దానికి తోడు సతీసహగమనం మరోదీర్ఘ రోగం. అందుకనే కవి గారు 'సతి' అనే కవితలో

'లోకములో వరశుల్క మొక్కటే
లోకువ సేయును కూతురి జన్మను' అన్నారు.

'స మత మొనరించును సకలమ్ముల
సమాజ మన్ని విధముల నారిని
సతిరూపమ్మున గౌరవించెడును
సతియని చితిపై కాల్చివైచును'

అంటూ వ్యంగ్యాస్త్రాన్నిగూడా సంధించారు. తరతరాల దురాచారాలను పెకలించడానికి యింకె న్నైనా అస్త్రాలు సంధించక తప్పదు.

ధర్మావతారం అన్న శీర్షికతో రైతురాజును ధర్మరాజుగా చిత్రిస్తూ సాంప్రదాయిక పద్ధతుల్లో చెప్పిన ప్రౌఢ శైలి కిదొక మచ్చుతునక.

శాంత నవ ప్రసన్నముఖ సంపద గౌరవ
నష్ట శంక వి
క్రాంతి గృపావలోకనము కర్ణకఠోర వచః
ప్రసంగముల్
కాంత హృదార్ధధీర వృషకాండ పరిశ్రమ
మెల్ల నీకు దు
ర్ధాంతము రైతనర్చు నిను రాజిల జేసెను
కష్టజీవిగా.

శాంత స్వరూపుడైన కర్షకుడు సహనశీలాన్ని పెంపొందించుకొనడం చేతను, పరువు ప్రతిష్టలకు వెరవడం వలననూ కష్టజీవి కావలసి వచ్చిందంటూ

---

వెల 10/ప్రతులకు,—రచయిత, రాజగోపాల్ పేట, 502375, మెదక్ జిల్లా.

---

కృషీవలుని మీద యీ సాహితీ కృషీవలుడు తన సానుభూతిని ప్రకటించాడు. శ్లేషార్థాలలో తన ప్రతిభను ప్రదర్శించాడు. ఇలాంటి వింకెన్నెన్నో హృద్యమైన పద్యాలు యీ పుస్తకంలో మస్తుగా దొరుకుతాయి.

అయితే అందమైన అట్టతో బాటు లోపలి కాగితం విషయంలో గూడా కాస్త జాగ్రత్తపడి ఉంటే ఈ పుస్తకం మరింత మనోహరంగా ఉండేది. ఇది కళా తపస్వి శ్రీ కిషన్‌రావు గారి దివ్యస్మృతికి అంకిత మీయబడిన కావ్యపుష్పోపహారం. కవితాపిపాసులకు శైత్యోపచారం.

.... 'ఆమని'

# వార్తావాహిని

## హిందీ విజయపత్ర వితరణోత్సవము

ది. 8-7-1991 సాయంత్రం 5-30 గంటలకు దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర, ఖైరతాబాదు భవనములో హిందీ ప్రేమీమండలి హైదరాబాద్ పక్షమున హిందీ విజయపత్ర వితణోత్సవము జరుపబడినది. భారత ప్రభుత్వ క్షేత్రీయ హిందీ అధికారి శ్రీ హెచ్. ఐ. ఉేఉే గారు అధ్యక్షస్థానం అలంకరించిరి. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ కార్మిక ఉపాధి మరియు గృహనిర్మాణ శాఖామాత్యులు గౌరవనీయులైన శ్రీ పి. జనార్థనరెడ్డిగారు సభకు ముఖ్యఅతిథిగా విచ్చేసిరి.

మండలి అధ్యక్షులు, సభ కోశాధ్యక్షులు శ్రీ చవాకుల నరసింహమూర్తి గారు తమ స్వాగతోపన్యాసంతో సభ, మండలి పక్షమున చేయుచున్న హిందీ ప్రచార కార్యక్రమముల గురించి విశదీకరించిరి. సభ హిందీ, తెలుగు భాషలలో పరీక్షలు నిర్వహించు చున్నదనియు, పత్రికలు నడపుచున్నదనియు తెలియజేసిరి. ఆంధ్రప్రదేశ్‌లో హిందీ ట్రైనింగ్ కాలేజీలను తిరిగి ప్రారంభింప జేయవలసినదిగా మంత్రిగారిని అభ్యర్థించిరి.

సభ కార్యదర్శి శ్రీ పిన్నమనేని ప్రసాదరావు గారు సభ పుట్టుపూర్వోత్తరముల గురించి వివరించిరి. మహాత్మాగాంధీ గారు ఈ సభను ప్రారంభించిరనియు, వారి సుపుత్రులు శ్రీ దేవదాను గాంధీగారు మద్రాసులో హిందీ ప్రారంభించిరని వివరించిరి. ఈనాడు సభ పరీక్షలలో లక్షలాది విద్యార్థీ విద్యార్థినులు పాల్గొనుచున్నారని తెలిపిరి.

సభకు అధ్యక్షత వహించిన శ్రీ హెచ్. ఐ. ఉేఉేగారు ప్రతివారు హిందీలో బాగుగా మాట్లాడటం, వ్రాయటం నేర్చుకోవాలని సలహా నిచ్చిరి. కేంద్ర ప్రభుత్వం హిందీ ప్రచారం నిమిత్తం ఆర్థిక సహాయం అందజేయుచున్నదని తెలిపిరి.

గౌరవనీయులు, మంత్రివర్యులు శ్రీ పి. జనార్థన రెడ్డిగారు దేవసేవ చేయుటకు, ఉద్యోగము పొందుటకు జాతీయభాష హిందీని తప్పనిసరిగా నేర్చుకోవలసినదిగా ఉద్ఘాటించిరి. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం త్రిభాషా సూత్రమును అమలు చేయుటద్వారా హిందీకి ప్రోత్సాహము ఇచ్చుచున్నదని విశదీకరించిరి. హిందీ ట్రైనింగ్ కాలేజీలు తిరిగి ప్రారంభింప చేయుటలో తప్పక తోడ్పడగలనని అభయమిచ్చిరి. విద్యా, ఉద్యోగ రంగాల్లో మహిళలు రోజురోజుకు ముందుకు వస్తున్నారని, పురుషులకు ఏమాత్రం తీసిపోని విధంగా ఆ యా రంగాల్లో వారు ప్రావీణ్యం సంపాదిస్తున్నారని మంత్రివర్యులన్నారు. హిందీ భాషను అభ్యసించడానికి బాలికలు హెచ్చు సంఖ్యలో ఆసక్తి చూపటం అభినందనీయమని, హిందీలో పండితులు గ్రంథ కర్త అయిన మన ప్రియతమ ప్రధాని పి. వి. నరసింహారావు గారిని బాల బాలికలు ఆదర్శంగా తీసుకోవాలన్నారు.

తదనంతరము బహుమతులను, హిందీ విజయ పత్రములను విజేతలకు అందజేసిరి.

శ్రీ యస్. కిషన్‌రావు గారు వందన సమర్పణ గావించిరి.

## హిందీ ప్రేమీ మండలి-గుంతకల్లు ప్రమాణపత్ర వితరణోత్సవము

తేది. 28-7-91 సాయంత్రం 5 గంటలకు హిందీ ప్రేమీ మండలి గుంతకల్లు, స్వర్ణజయంతి భవన ప్రాంగణమున హిందీ ప్రమాణ పత్ర వితరణోత్సవము జరుపబడినది. ప్రేమీ మండలి అధ్యక్షులు శ్రీ వంకదారు రామకృష్ణయ్య గారు అధ్యక్షత వహించినారు. అధ్యక్షులు తమ అధ్యక్షోపన్యాసములో భారత దేశములోని అన్ని భాషలకు హిందీ అను సంధాన భాష మరియు రాష్ట్ర భాషయని చెప్పి హిందీ చదువవలసిన ప్రాముఖ్యతను గురించి ఉద్బోధించిరి. ముఖ్య అతిథిగా డాక్టరు శ్రీ కె. చంద్రమౌళిగారు M.B.B.s. D.C.H విచ్చేసిరి. వారు విద్యార్థులు హిందీ నేర్చుకొనవలసిన ఆవశ్యకతను గురించి ఉపన్యసించిరి. శ్రీ కె. గంగిరెడ్డి కార్యదర్శి గారు. రాష్ట్ర భాషయైన హిందీ విశిష్టతను గూర్చి చెప్పిరి. శ్రీ కె. కె. లక్ష్మయ్యగారు కార్యదర్శి, సరస్వతి విద్యా మందిర్-గుంతకల్లు—ప్రాథమిక, మధ్యమ, రాష్ట్ర భాష, ప్రవేశిక, పరీక్షలలో ఉత్తీర్ణులైన విద్యార్థి-విద్యార్థినులకు ప్రమాణ పత్రములను పంచిపెట్టిరి.

శ్రీ డి. పకీరప్పగారు వందన సమర్పణ గావించిరి. జాతీయ గీతముతో సభ ముగిసినది.

## హిందీ విద్యార్థి మేళా, విశాఖపట్టణం

1991-జూలై 2వ వారం విశాఖపట్టణంలో స్థానిక యం. వి. డి. యం. హైస్కూలులో జరిగిన హిందీ విద్యార్థి మేళా సందర్భమున తరగతులు తీసుకొన్నటువంటి హిందీ ప్రచారకులు మరియు ఆ సందర్భములో ఆధర్శ హింది మహా విద్యాలయ నిరీక్షకు వచ్చినటువంటి హెచ్. ఐ. ఛే ఛే రీజినల్ ఆఫీసర్, కేంద్రీయ హిందీ నిదేశాలయం-శిక్షా విభాగం హైదరాబాదు శాఖ కాకినాడ నుండి వచ్చిన సభ కార్యకారిణి సమితి సభ్యులు పి. మహేశ్వరరావు ఎమ్.ఏ., అనపర్తి నుండి వచ్చిన శ్రీ కర్రి పట్టాభిరామిరెడ్డి ఎమ్.ఏ. పి. హెచ్‌డి. ఉత్తరాంధ్ర. సంఘటకులు, దక్షిణ భారత హిందీ ప్రచార స ఉపాధ్యక్షురాలైన యం. వేదవల్లి, కార్యకారిణి సభ్యులైన శ్రీ యం. శేషాచారి, విద్యాలయ నిర్వాహకులు అయిన శ్రీ యం. వి. టి. ఆచారి ఎమ్. ఏ. శ్రీమతి యం. సీతాలక్ష్మి మొదలయిన వారు ఆశీనులైయున్నారు.



నిర్వాహకులుగా వుంటూ హైదరాబాదులో హిందీ ప్రచారం చేసెడివారు. వారితోడ్పాటు తోను, తదితర ప్రముఖుల సహకారంతోను 1957వ సం॥లో హైదరాబాదు, ఖైరతాబాదు సెంటర్‌లో 3600 చ.గ. స్థలాన్ని అందలి భవనంతోసహా కొనియుండిరి. తర్వాత అనేక భవనాల నిర్మాణం జరిగింది దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర కార్యకలాపాలు, పి.జి. కాంప్లెక్స్ తరగతులు ప్రస్తుతం యీ భవనమందే జరుగుచున్నవి

శ్రీ టి మద్దులేటయ్య, కె. గంగిరెడ్డి వగైరా గుంతకల్లు ప్రముఖుల సహకారంతో హిందీ ప్రేమీమండలి వారు దక్షిణ భారత హిందీ ప్రచార సభ, వారికి 1982వ సం॥లో 330 చ. గ. ల స్థలమును గుంతకల్లులో దానంగా యిచ్చియుండిరి. సభవారి ఆర్థిక సహాయంతో భవననిర్మాణం జరిగింది. ఈ భవనంలో దక్షిణ భారత హిందీ ప్రచార సభ రాయలసీమ శాఖ కార్యాలయం పని చేస్తున్నది. సభ నిధిపాలక మండలి సభ్యులు శ్రీ వంకదారు రామకృష్ణయ్యగారు భవన నిర్మాణ కార్యక్రమములను పర్యవేక్షించుచున్నారు. —చిన్నమనేని ప్రసాదరావు. కార్యదర్శి

सोनिया गांधी
10 जनपथ, नयी दिल्ली 110 011

हमारे इस दुःख को अपना मानकर आपने जो संवेदना भेजी है उसके लिए हृदय से आभारी हूं।

सोनिया गांधी

जून 1991

దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర, హైదరాబాదు కార్యకారిణి సమితి మరియు వ్యవస్థాపికా సమితి సమావేశములలో శ్రీ రాజీవ్‌గాంధీ ఆకస్మిక మరణానికి చేయబడిన సంతాప తీర్మానము సోనియాగాంధీకి పంపబడినది. దానికి ఆమె ఆంధ్ర సభ అధ్యక్షులు శ్రీ బోయపాటి నాగేశ్వరరావు గారి పేర పై సమాధానం పంపినారు.

# స్రవంతి

## తెలుగు సాహిత్య మాసపత్రిక

'స్రవంతి' మరింత తెలుగు సాహిత్య సేవ చేయడానికి మీ అందరి సహాయ సహకారాలను అర్థిస్తున్నాము. ప్రకటనలను అందజేసి మీ వ్యాపారాభివృద్ధితోపాటు సాహిత్య సేవలో భాగస్వాములు కాగలరని ఆశ.

### ప్రకటన ధరలు

పత్రిక సైజు 1/8 క్రౌన్

| | |
|---|---|
| నాలుగవ కవరు పూర్తి పేజీ | రూ. 1,000.00 |
| రెండవ, మూడవ కవరు పూర్తిపేజీ | రూ. 600.00 |
| లోపలి పూర్తిపేజీ | రూ. 500 00 |
| లోపలి సగం పేజీ | రూ. 300.00 |
| లోపలి పావు పేజీ | రూ. 175.00 |

ప్రకటనల విషయం, బ్లాకులతోపాటు డి.డి- చెక్ పంపవలసిన చిరునామా :-

కార్యదర్శి, దక్షిణ భారత హిందీ ప్రచారసభ-ఆంధ్ర

ఖైరతాబాదు, హైదరాబాదు-500 004.

Edited Printed and Published by P. Prasada Rao on behalf of the D. B. Hindi-Prachar Sabha-Andhra, Khairatabad, Hyderabad-500 004.